

రంగురంగుల కాగితాల పీలికలను ఫ్రేమ్‌పైన అంటించి, వెనుక కర్రముక్కల సహాయంతో మిట్టపల్లాలవల్ల సజీవంగా రూపింపచేసే చిత్రాలనిర్మాణం అమెరికాలో ఇప్పుడు వ్యాప్తి చెందుతోంది

పై చిత్రంలో 17-వ శతాబ్దపు పాశ్చాత్య గృహాలంకరణ చిత్రించబడింది చిత్రకారుడు-కార్ల్ ఫిషర్



స్వార్థం జీర్ణించి, బీద గొప్పల
వ్యత్యాసాలతో కుళ్ళిపోయిన
నేటి ప్రపంచానికి
సర్వ మానవ సమానత్వం
చాటు

వినోదా వారి

# శాంతి

చంద్రకుమారి సావిత్రి సి హేమలత
డా॥ గోవిందరాజుల సుబ్బారావు రామచంద్ర కాశ్యప
ఆరణి పేకేటి శివరాం

కథ కొవ్వలి
పాటలు సముద్రాల జూ॥
సంగీతం సుబ్బరామన్
ఛాయ రంగా
కళ వాలి, గోడ్‌గాంకర్
దర్శకత్వం వేదాంతం రాఘవయ్య



పూర్ణా రిలీజ్

నిర్మాతలు.. వినోదా పిక్చర్సు.. మద్రాసు 17

MATA

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
Founder K. NAGESWARA RAO

సంపుటము 44
సంచిక 20
23-1-52

ఖర సంవత్సర పుష్య బహుళ ఏకాదశి బుధవారము

## విషయానుక్రమణిక

## 1952 జనవరి 23

# సాక్షులు

## శ్రీ ఘట్టి కృష్ణమూర్తి

ఆ వూళ్ళో చెరువు ఒడ్డున ఒక రెండంతస్తుల మేడ దాని ప్రక్క రావి చెట్టుక్రింద పడివున్న సిమెంటు బెంచీకి మూడే కాళ్లు నాలుగో కాలు విరిగి యెన్ని నెలలు గడిచాయో నరాలూ, బొమికలూ బయట పడినట్లు నాలుగైదు యినుప చువ్వలుమాత్రం చూసినవాళ్ళ కళ్ళబడుతూ వుంటయ్

పడిపోకుండా పోటీ పెట్టిన యిటుక రాళ్ల దొంతర్లో వొకొక్కటే చివికి చవుడు గారడం మొదలు పెట్టింది ప్రస్తుతపు అవస్థజూసి దాని జీవిత పరిమాణాన్ని నిరయింప బూనుకోవడం అతి సాహసమే అనిపించుకుంటుంది!—

రెండంతస్తులు పెరిగినా, ఎండవానలకు ఒళ్లు దాచుకోలేకుండా దిగులుతో పంచప్రాణాలూ గుప్పెట పెట్టుకుని మానమర్యాదలకోసం తంటాలుపడే మధ్యరకం సంసారిలాగా కనబడుతూ వుంటుందా మేడ

నాలు ఒక ప్రక్క మేకులు వూడి ఊగిపోతూ జీవితంలో అంతిమ పథం అందుకోజూస్తున్న నిరంతర యాత్రికునిలా కాలం తీర్పుకై వేచివున్నట్లున్నయ్

తుప్పు పట్టిన తాళాలు, గొళ్లాలను కోట విరుచుకుని, పంతంతో పట్లు బిగించి, చెర కడిపించుకో జూసే తలుపులమ్మ జీవితాన్ని ఖైదుచేసి ఖూనీ చెయ్యాలని చూస్తూవుంటయ్.

పై అంతస్తుకు కట్టిన కొయ్య సోపా

అది ఏనాడో మనుషులకోసం కట్టబడిన మేడ అనీ, వారి రాకకావసరాలకు అదెంతో ఉపయోగపడుతూ వుండేదనీ, అక్కడి గోడలమీద అంకెలూ, అక్షరాలూ చూసినవాళ్ళకు కొంతకు కొంత తెల్లమౌతుందేమో

సున్నపు పెత్తులు ఊడిపోతూ సగం సగం చెరిగిపోయిన ఆ చిహ్నాలు అంతకంటే ఎక్కువ సమాచారాన్ని అందించలేవు! ఇప్పు డక్కడ రాజ్యం చేసేవి, చిమటలూ-బల్లులూ తేళ్లూ జెర్రిలూ మాత్రమే

గూళ్లు పెట్టుకుని పిల్లల్ని బ్రతికించుకునే భద్రతకూడా లేకపోవడంవల్ల యీ మధ్యనే కొన్ని పిచ్చుకల కుటుంబాలు అక్కణ్ణించి వలసపోయినయ్

ప్రక్కనే వున్న రావిచెట్టుతొఱ్ఱల్లో వుంటున్న చిలుకల సంతానాలు కుటుకు కలకలంగా కూసేస్తూ ఆ ప్రాంతపు దృశ్యానికి ఒక వింత శోభను పొదివి పెడుతూ వుంటయ్ ఇదంతా చెరువు నీళ్ళల్లో ప్రతిబింబిస్తూ అటుకేసి వస్తున్న చూపరుల్ని అడుగు కదలనివ్వరు

ఎవరైనా ఆ వీధిలో అక్కడ నిలబడి కన్నెత్తి చూశారంటే, కలకల్లాడే ఆ పక్షిరాజ్యపు సొంపును తిలకించి మురిసిపోవాలనే తలంపుతోనే, అంతే కాదు ఆ దృష్టి అంతటితోనే మళ్లించుకుని ప్రక్కనున్న మేడ తమ లక్ష్యం కారాదనే ఏవగింపుతో దారినిబడి గమనానికి వేగాన్ని హెచ్చిస్తూ వుంటారు కూడాను

ఇద్దరు కూడి ఇష్టాగోష్ఠిగా మాట్లాడుకుంటున్నప్పుడు చెరువుగట్టున వున్న మేడను గురించి చిలవలు పలవలుగా కథలు అల్లుకుంటూ తమ పరోక్షంలో వున్న మూడో వ్యక్తికి ఏదో వొక తప్పిదాన్ని అంటగడుతూ వుంటారు కాగల కార్యాన్ని గురించిన తమ విమర్శ పరాకాష్ఠ అందుకున్నట్లు వారి మొహాల్లో ఏదో వొక సంతృప్తి కానవస్తూవుండడంకూడా కద్దు

ఆవూళ్ళో అలాంటి విమర్శలకు ఏమాత్రమూ కొదవలేదు ఏ అరుగుమీద జూసినా, సముద్రుడు నురుగులు గక్కుతున్నట్లు ఒకొక్కప్పుడు చెలియలి కట్టదాటి పరిసరాల శాంతి భద్రతలకు భంగం కలిగిస్తూ వుంటయ్

వీరి వాగ్బాణాల తీవ్రాఘాతాలకు గురి అయిన ఆ మేడకు ఒకొక్క దెబ్బకే ఒకొక్క సున్నపుపెత్తు రాలిక్రింద పడుతూవుంటుంది ఒకొక్క అక్షరమే తన స్వరూపం మార్చుకుని పులకతో సంక్రమించిన అర్థాన్ని వీడి వికృతమైన ఊహాలు జనింపజేస్తూ వుంటుంది

జీవితంలో అర్థాంతరంగా సంక్రమించిన ఆశ్రయాన్ని భద్రపరుచుకుంటూ, తరతరాలుగా తమ వంశోన్నతికై పాటుబడుతూ పరిసరాలను నవ్య చైతన్యవిలసితం చేసుకునే శుకసంతతి కీరిమాటలను వినిపించుకోకుండానే, కన్నబిడ్డలకు ఆహారాన్ని నోటికందిస్తూ మైమరచి రొదచేస్తూవుంటయ్

కదలిపోలేని పిల్లగాలులు కూడా కౌతుకం ఆ కలకలాన్ని ఆలకించి దానిని ప్రకృతి కందించే తలంపుతో వీధన గట్టుకు తోసుకుపోతూ తమ అనంతయాత్రకు దారి వెతుక్కుంటూ వుంటయ్

జీవితం ధన్యమైనట్లు సగర్వంగా తలలూగించి లేజిగుళ్ళ హస్తాలతో ఉన్నత పథాన్ని కమ్ముకుంటూ వంగురంగుల కిరణాలతో చెలిమిచేస్తూ వుంటుందా మహావృక్షం

మానవుడే తనంత తాను సృష్టించుకున్న యీ రెండు వస్తువులకూ గల అంతర్యం ఏపాటిదో ఊహించి చెప్పగల శక్తి ఎవ్వరికీ లేదు

ఆ వూరివారి నడిగితే దాని కెంటి సంతృప్తికరమైన సమాధానమూ యివ్వక పోగా పైపెచ్చు వారి పరోక్షంలోవున్న వ్యక్తిపై గల అక్కసును వెళ్ళ గ్రక్కుతూ

వుంటారు కర్తవ్యాన్ని నిర్దేశించుకుని వాస్తవం ఎలా ఖూనీ అయిందో స్థిమితంగా కూర్చుని ఆలోచించే శక్తి వారిలో యెవ్వరికీ లేదని క్రొత్తగా అక్కడకు వచ్చి పరిసరాలను పరిశీలించినవారికి వ్యక్తమవుతుంది

కాని అతి డంతటితో వూరుకుంటేనే పెద్దమనిషిగా బ్రతికి బయట పడగలడు అందుకనే ఆ విషయాన్ని గురించి ఉచితమైన సలహా యివ్వడానికి అక్కడివారి అంతరంగికులనుకోబడేవారే వెనుకంజ వేస్తూ వుంటారు అదంతా వేరేవిషయం అనుకోండీ! ఇక ప్రస్తుతానికి దిగుదాం,

మూడుకాళ్ల సిమెంటు బెంచీమీద పడుకున్న వ్యక్తి గంగుచీమ కాలు పట్టుకు కరవడంతో గాభరాగా యిటూ-అటూ దొర్లాడు పోటీపెట్టిన యిటుకరాళ్లలో వొకటి నలిగి నుశైపోయింది బెంచీ ఊగిసలాడింది ఊతంగా పట్టుకుని పడిపోకుండా లేచి కూర్చోవాలనే అభిప్రాయంతో రెండు కాళ్ళూ వున్న వేపుకే లేవబోయాడు, కాని బరువంతా ఒక ప్రక్కకే మోపబడడంవల్ల బెంచీ నిటారుగా లేచింది అంతవరకూ అతడికి తెలియనే తెలియదు మూడో కాలు కూడా అతుకు పెట్టే వున్నదని అది వీపుమీద పడిపోకుండా ఏలాగో తప్పించుకుని ఇవతలకి రాగలిగాడు



ఉత్తరీయంతో వొళ్లు దులుపుకుంటూ ఒకసారి తన చుట్టూ చూసుకున్నాడు పైదృశ్యమంతా చెరువులో ప్రతిబింబించి చూడ ముచ్చటగా వుంది

నాలుగడుగులు ముందుకు నడిచి నీళ్లు కదిలించి కళ్లకు ద్రోహం చేసుకోలేక తదేకంగా ఓక్షణంపాటు అలాగే చూస్తూ నిల్చుని పోయాడు .

చిలుకల రొద కొంత తగ్గినట్టయింది చెరువులో పడివున్న దృశ్యంలోనూ మార్పు వచ్చింది నాలుగు దోసెళ్ల నీళ్లు త్రాగి పైకివచ్చి సిమెంటు బెంచీ చివర కూర్చుని దీని చరిత్ర ఏవిటో అని విచారించడం మొదలు పెట్టాడు దానిమీద అతడికి కనుపించినదల్లా ధర్మం అనే రెండక్షరాలు మాత్రమే దీని నెవరో ధర్మంచేసి వుంటారని మాత్రం సులభంగానే గ్రహించుకోకలిగాడు కాని అసలు ప్రశ్న అలాగే మిగిలిపోయింది ఈ మేడప్రక్కన, ఈ బెంచీ ఇలా పడివుండడానికి కారణం ఏవిటా? అని అంతటితో ఆగకుండా అతడక్కణ్ణించి లేచి ముందుకు-మేడవేపుకు-నడిచాడు

గోడమీద రెండు బల్లులు కచ్చగా చూసుకుంటూ ఒకదానొకటి మింగెయ్యాలనే రోషంతో తోకలు త్రిప్పుతూ అదనుకోసం కనిపెట్టుకు చూస్తున్నయ్

ఆ వైపునించి వొచ్చే గాలికి గోడల మీంచి రాలే దుమ్ము అతడి రెండు కళ్లల్లోనూ పడింది ఉత్తరయ్యంతో యెంత తుడుచుకున్నా కంట్లో మెరమెర తగ్గనే లేదు— ఏదో ఆలోచిస్తూ అలాగే నిల్చునేసరికి గులాం చల్లినట్టు చొక్కా అంత ఇటుకలపొడితో నిండిపోతోంది అనుకున్నదంతా మేడ అవతలకు వెళ్లి ఆలోచించవచ్చునని వెనుదిరిగి వచ్చేశాడు

పడమటేపున మేడకు ఆనుకొనివున్న రేకుల వసారాలో పొగ రాజుతున్నట్టు అతని కళ్ళు బడగానే ఆశ్చర్యసంభ్రమాలతో యివతలకునడిచి వచ్చేశాడు

వసారకు ఒకవైపున మాత్రం చిన్నదడి కట్టివున్నది ఇంకొక వైపున సగం తెగిపోయిన నులకకుక్కి అడ్డంపెట్టి దానిపైన ఒక చింకి యీతాకులచాప అడ్డంగా వ్రేలాడవేయబడి ఉన్నది మరికొంత ముందుకు డిచి వసారాలోకి తొంగిచూశాడతను న

ఎవరో వొకస్త్రీ-సుమారు 60 సంవత్సరాల వయసుండవచ్చు తలంతా ముగ్గుబుట్టలా నెరసింది ముక్కుకు అడ్డబాస, మొహాన కానీ అంత కుంకంబొట్టు పొయి ముందర ముడుచు కూర్చుని ఒకొక్క ఎండుగోగు పుల్ల విరిచిపెడుతూ మంటచేసి అన్నం వండుతోంది ఒకొక్కటే విరిచి పెడుతుంటే ముంజేతులనున్న ఇత్తడి కడియాలు రాచుకుని చిన్నధ్వని అవుతోంది

అన్నం చిట్టుడుకు పట్టింది, కళపెళలాడుతోంది తెట్టుకట్టి పొంగి పొయిలో పడుతోంది మూత పెట్టిన చిల్లులమూకుడు తీసి క్రిందపెట్టి, గంజివార్చే పిడత పొయి దగ్గరగా జరిపి, కలియదీయడానికి తెడ్డు కనబడక ప్రక్కనున్న దడిలో వెతుక్కుంటూ యాదాలాపంగా యిటువైపుకు తలెత్తి చూసింది ఉత్తరయ్యంతో వొళ్లు దులుపుకుంటూ, మెరమెర లాడినప్పుడు కళ్లు నుసుముకుంటూ అక్కడే నిలబడివున్నాడా వ్యక్తి—

“పిచ్చి మారాజు, సిట్టెయ్యగారల్లుడు మల్లీ వొచ్చాడు గామాలు” అనుకున్నదా స్త్రీ
అక్కడే నిలబడి అతడితో ఇలా అన్నది—

“ఏం బాబూ! లేవ లేవకే మా కాడికే వొచ్చి అములు జెయ్యకపోతే మావయ్యగారితో మంచి మాటాడుకోగూడదూ? ఆరి మాట యిని ఆ వీదిలోకి బోతే యీరు గంతులేస్తారు, ఈరి మాట యిని యిటొస్తే ఆరు పవాల్లేస్తారు మజ్జ మేమేం జచ్చేది చెప్పు! కరవమంటే కప్పకోపం, యిడవమంటే పావుక్కోపమూను” అంటూ పొయి వేపుకు మాసి “గంజి గట్టిపడుతోంది గానీ, కుర్రాడల్లాకే పదండి పొద్దున తిన్న కూడాయె ఇప్పుడే ఇంటికొచ్చి పొయ్యంటించాను అంటూ యివతలకువచ్చి అన్నానికి పదునుబట్టి గంజి వార్చడంలో నిమగ్న అయిందా స్త్రీ

ఈ మాటలన్నీ వినేసరికి కంటి నలుసులతో కణతలు కట కట్లాడుతున్న ఆ వ్యక్తి తెప్పరిల్లుకున్నట్టు ఒక్కసారి ఈ వైపుకు తేరి పార జూశాడు

తనను యెవరనుకుని ఆ విధాన దులపరించి మాట్లాడిందో బహుశా యీమెకు ఎవరిమీదనో కోపం వుండివుంటుంది దానికితోడు ఎంతో కాలం నించీ యిక్కడే ఉంటూన్నట్టున్నది కూడాను ఎందుకైనా మంచిది, అసలు విషయం అడిగి తెలుసుకోవాలనుకున్నాడు నాలుగడుగులు ముందుకువచ్చి లోనికి తొంగిచూస్తూ ఇలా అడిగాడు-

“ఏవిటీ నువ్వనేది? మా దీవూరు కాదు ” అతడేవిటో ఇంకా చెప్పాలనుకుంటున్నాడు మాట మధ్యలోనే అందుకుని, “అవున్లే, మీ దివూరు కాదని నాకు జెప్పొచ్చావ్ పెద్ద మడిసవి! సావుకారు సిట్టెయ్యగారు సెల్లమ్మని పెంచుకున్న

నాడే నువ్వీ వూరి అల్లుడవయ్యావంట సరేగానీ, వొచ్చిం తరువాత ఒక్క నాడైనా పుట్టింటి కెల్లావు? పెల్లికొడుకు మల్లే తినమరిగి తిన్న తిండి యెట్టా అరుగుద్దిలే అయినా? మజ్జ, మజ్జ మాబో టోళ్ళ మీద కూసిని కేక లేత్తుంటేగాని, పొద్దోవదు మారాజుకి ఎందు కొచ్చింది గానీ యెల్లి మావయ్యతో జెప్పు" అంటూ గంజి వార్చిన పిడత ప్రక్కనున్న ఉట్టి మీద పెట్టబోతూ అటువేపుకు తిరిగి చూసింది చూసీ చూడగానే, నువ్వెవరు బాబూ? మా పిచ్చిబాబుగా రనుకున్నా" అంటున్నప్పుడు యెవరో తెలియని కొత్త వ్యక్తితో తను ఇష్టంవచ్చినట్టు మాటాడి నందుకు మనసులో కొచ్చుకుంటున్నట్టు ఆమె మొహంలో స్పష్టంగా కనబడు తోంది అతడింకా ఉత్తరయ్యంతో వొళ్లు దులుపుకుంటూనే ఉండడం చూసింది ఇలా అన్నది "ఏంబాబూ! కొత్తగా యీ వూరొచ్చిన మారాజల్లే వుండావ్! ఈ మేళ్ళోకి బోయావా ఏం? వొళ్ళంతా సవుడు దులుపుకుంటున్నావ్ తెల్చిన మారాజెవ్వడూ అందులో అడు గెట్టడు మేం యీ పంచను వుండి కొసుకు తాగడానికే సచ్చిపోతుండాము ఎవు రన్నా గెట్టిగా టపాకాయ కాలిస్తేనే గబుక్కున సవుడు రాల్తంది ఈ గోడలు చూస్తేనే సాలు, కడుపు నిండుద్ది బాబూ! ఇంకా లోపలి కెల్లడ మెందుకు?" అంటూ పొయిలో మంట దిగలాగి అన్నం కుండ మీద మూతబెట్టి తల గిరి ముడేసుకుంటూ వసారాలోనించి బయటకు వచ్చేసింది "ఏ వూరు బాబూ?" అని ఆ నిల్చున్న వ్యక్తిని అడిగింది

"మాది యీ వూరు కాదని చెబుతుంటేనే" అన్నాడతను

"కాదులే మాసావుకారు అల్లుడు అచ్చంగా మీకుమల్లేనే వుంటాడు పట్నాకా మా యింటికాడికొచ్చి సతా యిస్తూ వుంటాడులేండి ఇక్కడికంతి చోరవగా వొచ్చేది కూడా ఆ బాబే ఇంతకీ మీవూరేదో సెప్పరు మారాజులు, రైల్లోదిగి కూసిని మంచినీల్లన్నా తాగిరండి బాబూ! అవకాడ ఆ సెట్టు కొంచెంచి దిగ డానికి మెట్లుండయ్" అని ఆ మారం నిర్ల క్ష్యంగా వుండగానే నాలుగు చినుకులు కురు కలంగా కూపేస్తూ ఆమెకు నెత్తిమీదుగా యొదురుతూ దూసుకు పోయినయ్ వాటిని మరొక చేత్తో అదిలించుతూ "పాడు సిల కలు పొద్దస్తమానమూ ఇంతేగందా! వినలేక సెవులు సిల్లులడిపోతుంటయ్ బాబూ! మరో సోటు సూపించమంటే మీ రక్కడే పడుండాలి లేకపోతే ఆ మాత్రమన్నా అది నిలవకు అంటాడు పెసిడెంటుబాబు ఏం సచ్చేది సెప్పండి, మాకెందుకని మెదల కుండా వూరుకుంటేనే యెవరో వొచ్చి గిల్లికజ్జా పెట్టుకోవడం, మమ్మల్ని వీది లోకి లాక్కు రావడమూను మా వూరంటే యేంటనుకున్నారు? మంటి పిల్లైనా మా పిల్లే గెలవాలంటారు ఇంతకీ మందే వూరో సెల విచ్చారు కాదు బాబూ, అని అడిగి ఆతడి వంకే చూస్తూ వుండిపోయింది

తనను గురించి తెలుసుకోవాలనే ఆ కాంక్ష ఆమెలో పెరుగుతున్న కొలదీ, తను మరింత బిర్ర బిగియడం ఉచితం కాదను కున్నాడు తగు రీతిని ఏదో వొక సమా ధానం చెప్పి తనకు కావలసిన సమాచారం యావత్తూ కాకపోయినా కొంతవరకైనా తెలుసుకోవడం మంచిదనుకున్నాడు

చిన్న నవ్వు నవ్వి ఆమెతో ఇలా అన్నాడు "ఒక ఊరేవిటి పల్లేవిటి? అయిన చోటల్లా తిరుగుతూ వుండడమే మా పని ఈ ప్రక్క వూళ్లోకే యేవో కొన్ని సరుకులు తీసుకు వచ్చాం అవన్నీ అమ్ముడు పోవద్దూ మరి? ఈ చుట్టు ప్రక్కల వూళ్లల్లోనే కొన్ని దుకాణాలు తెరవాలనుకుంటున్నాం అంగుకు అనువైన చోటు ఎక్కడ దొరుకు తుందా అని, వెతుక్కుంటూ బయల్దేరాను ఈ వూరి సంగతి నాకు బొత్తుగా తెలియక పోవడంవల్ల వచ్చీ రావడంతోనే ఎండలో బడి నడిచి వచ్చానేమో- వొళ్లంతా తాపంగా వుండడంవల్ల చల్లదనానికి కాసేపు ఆ చెట్టుకింద నడుం వాల్చాను. ఆ బల్ల కాస్తా అటూ — యిటూ వూగిసలాడడం మొదలెట్టింది లేచి, చెర్లో కాసిని మంచినీళ్లు త్రాగి యీ మేడ యెవరిదో యేవిటో కథ కనుక్కుందామని ఇటు వచ్చాను అంతే గాని చెల్లమ్మా లేదు పిచ్చిబాబూ లేడు" అంటూ పొడిగా నవ్వి ఊరుకున్నాడు

ఆమెకూడా అతడికంటే బిగ్గరగా— పకపకా—నవ్వేసింది "నిజంగా మీరు పిచ్చిబాబులే ఎందుకనంటారా? యీ మేడను గాని, యీ చెరువునుగాని, యీ చెట్టునుగాని అడిగినవాళ్ళింత వరకూ యెవ్వరూ లేరు ఎవుగో కొందరు గొడ్ల దగ్గిర బుడ్డాళ్లు నీళ్ళుబెట్టుకొనడంకోసం గొడ్డదోలుకొచ్చినప్పుడు తప్పితే దినివేపు కన్నెత్తైనా చూడరు గందా, యెందుకూ మీకంత కుతూవలమంట?—ఆ సెట్టెక్కి సిలకల్ని పట్టుకుంటున్నా, మేకల్దోలు కొచ్చి కొమ్మలు నరికేస్తున్నా, ఆ బల్లలు పగలగొడుతున్నా—కోళ్ళన్నీ యిరగ్గొట్టే శారు గందా!- నేనే అప్పుడప్పుడూ అది లిస్తూ వుంటా మావోళ్లు ఆ మాత్రమన్నా కల్పించుగోరు అసలోళ్ళకే సీమ కుట్టినట్ట యినా లేకపోతే యియ్యాలుండి కేప్పాగ్యో వాళ్ళం మన కెందుకు పొమ్మంటారు మధ్య మధ్య సావుకారుగారి ఆంబో తొచ్చి గోడలు కుమ్మేస్తూ వుంటుంది

చూడండి, యేవజాన గొయ్యడిపోయిందో దిక్కా, మొక్కా? కనుక్కునే నాథు డేడీ?– ఎంచేపటికీ, పార్టీలూ, కక్షలూ, పోట్లాటలూ, తీర్పులే తప్ప ఒక్కడైనా మేడ

వేపుకి కన్నెత్తి సూస్తారంటారా? అరుగుల మీద కూసుని కొరడాలతో గొట్టినట్టు మాటలనుకోమంటే అందరికీ వొళ్ళు పెరిగిపోతుంది, యే గంగారమ్మో పోలేరమ్మో పూనకం బూనినట్టు వొక్కళ్ళంటే వొక్కళ్ళు సిటైదు గింజలైనా దీనికోసం కర్చుడతారా? అంటే ఊహు నల్లమేక నీసుకు రావొద్దూ? పైగా యేమన్నా అంటే యీదు లూడుసుకొనేవోల్లకి మీకెందుకు, ఎంతలో వుండాలో అంతలోనే వుండాలిగాని, అంతకు మించి మాట్లాడితే పుచ్చెగురుద్ది సుమా, అంటారు ఏంజచ్చేది బాబూ! నిజం సెపుతాను, ఎవ్వరితో నూ అనకండేం!—యీ వూళ్ళో దుకాణం బెట్టి బాగుపడిన వోడు ఒక్కడూ లేడనుకో ఎవరో పారుపూరి కోవంటాయన వొచ్చి కొట్టు తెరిస్తే పూరందరూ కీసులాడుకుని కొన్న దానికి లెక్క జెప్పక వొంతులు పోయి, ఒకళ్ళ కొకళ్ళు అంటూ పొంతూ వుండక నానా యేడుపులూ యేడిపిస్తే అట్టదులుపుకుని సెత్తినగొట్టుకు పోయినా డాయన ఇంకెందుకు బాబూ! ఇక్కడ కొట్టెడతానంటావ్, తెలిసినవోళ్ళెవ్వరూ యిక్కడికి బాగుపడి బట్ట కడదామని రారు



బాబూ! నేనిట్టా జెప్పానని కోప్పడకండేం! ఉన్న సంగతంటే ఉలుకెక్కువంట ఈ అరిందాలంతా కల్పి యేం జేశారో సెప్పండి!" అని ఊరుకున్నది

ఆ స్త్రీ అలా యెందుకు మాట్లాడుతుందో, అతడికేమీ అంతు పట్టడం లేదు కాని తను అనుకున్న ప్రయోజనం మాత్రం కొంతకు కొంత నెరవేరుతున్నట్టుగా వుండడంమూసి అసలు విషయం ఆసాంతం తెలుసుకు వదలాలనే కుతూహలం యెక్కువయింది ఇలా ఉపక్రమించాడు "సరే గానీ, అసలు మీరెవరో నాకు జెప్పనే లేదేం? మొదణ్ణించీ మీ దీ వూరేనా యేం? ఆ వొసారో వొక పంచని యెందుకు పడివున్నారు? పంచాయితీవాళ్ళు మిమ్మల్ని యిక్కడే యెందుకు వుండమన్నారు? ఈవూళ్ళో వీధులూడ్చేందుకు కూడా మనుష్ల్ని పెట్టారన్నమాట! అయితే పెద్ద పెద్ద షావుకార్లూ మోతుబరు రైతులూ— ఉన్నారనుకుంటాను మరి మేము దుకాణం పెడితే అమ్ముడవవంటావేం? చూస్తే, యీ వొక్క మేడ తప్ప తక్కినవన్నీ కలకల్లాడుతూనే ఉన్నయ్యే! ఎందుకనంటావ్ ఇదిట్లా చవుడుగారుతోంది?" అని

ఈసారి ఆమె అంతగా నవ్వలేదు ఎదుటి వ్యక్తికి ఏదో తెలియజెప్పాలనే తహతహ అధికమైనట్టుంది ఇలా మొదలుపెట్టింది "ఆ సంగతే నేనూ జెప్పాలనుకుంటున్నా బాబూ! మూడూ రోజులు దగ్గరపడాయ్ లేండి! కార్తీకమాసం యెల్లేతలికి యిక్కణ్ణించి వెండాయెత్తెయ్యాలి బతికుంటే బలుసాకు తినొచ్చు యీరి మన్నబడి నలిబిలైపోతూ యెన్నాళ్ళని బతగ్గలం బాబూ! ఏలడానికి కూళ్ళు లేవుగానీ, తొంగున్నకు తినే వోళ్ళకేం తక్కువ? ఒక్కసారి ఆ వేపుకి పదండి బాబూ! మీ కూ అంతా అర్థమవుతుంది అంటూ రావిచెట్టు వైపుకు సాగారి వొచ్చింది అతడూ అక్కడికే చేరుకున్నాడు

"యీ బల్ల సూడండి, ఏ వజాన యిరగొట్టారో!" అన్నది మూడు కాళ్ళ సిమెంటు బెంచీ చూపిస్తూ

"అవును మొట్టమొదటగా నే నిక్కడే పడుకున్నాను క్రింద పడటానికి సిద్ధమై లేచి కూర్చునే సరికి అదే నా మీద పడేదయింది"

"అవును బాబూ! అవును-నే జెబితే మీకు నవ్వుగా వుంటుంది గానీ యిదంతా మా తిరపతయ్యగారి సలవే అనుకొండి

ఆయనన్నే సిట్టెయ్య గారంటాం లేండి ఆ మారాజు తల్చుకుంటే యిదేంటి యింకా యెన్ని మేడలైనా నవుడు గారిపించి, సీకు తాటాకుల గుడిసెల కింద జమకట్టేయించగలడు వూళ్ళోకల్లా పెద్దోడుగందా, ఆ మాత్రం వుండొద్దూ, మీరే జెప్పండి ఇది యిట్టా దిక్కూ-దివాణం లేక పడివున్నదంటే దీని కంతకీ యింకోళ్ళనే పనేముంది బాబూ!" చెట్టుఆకులు కదలా డేసరికి ఎవరు వస్తున్నారో అని తెరుకుగా వెనక్కు తిరిగి చూసింది "అన్నంకుండ గట్టిగా మూతేసుకొస్తాను" అంటూ అటువేపు వున్న వసారాలోకి చకచకా నడిచిపోయింది

ఇప్పుడతడు ఏదో తెలియని అవస్థలో కొట్టుమిట్టాడుతున్నట్టు ఇటూ అటూ పచార్లు ప్రారంభించాడు వొక్రమాలకి దృఢంగా నిశ్చయించుకున్నాడు కూడా, "వ్యక్తి విలువలతో పని లేదు యథార్థం తెలుసుకోవడమే తనకు ముఖ్యము" అని

అన్నం మూతపెట్టి ఆమె తిరిగి వస్తూ వుంటే "అవ్యాజమనస్కత" అనేదానికి అర్థము, తాత్పర్యమూ చెప్పుకోవాలనుకుంటున్నాడతను దురాగ్రహం పంతం బట్టి మనసును వశం జేసుకున్నదేమో అనిపిస్తుంది కొంతకాలం కాని ఆ వ్యక్తికి దురాగ్రహమంటే యేవరు నమ్ముతారు? జీవితయాతనలు వరసగా లకూ జీర్ణించి ముడతలు పడిన ఆ బక్కదేహంలో అక్కసు వెళ్ళగక్కుకోవాలనే ఆరాటం కంటే యథార్థం వెల్లడించాలనే ఉత్కంఠే యెక్కువగా వున్నదనుకోవడం సత్యదూరం కాదేమో

అతని ఆలోచనలు ఒక తీరానికి చేరుకోకుండానే ఆమె వాగ్ధోరణి ఇలా ఆరంభమయింది

"పులిని జూసి నక్క వాత లెట్టుకున్నదంట! కాకపోతే మరేంటి జెప్పండి పక్క వూళ్ళోవాళ్ళు ఏ గంతు వేస్తే తమరూ దాని కోసమే యెగిరితే యేమవుతుందీ? కబుర్లు మాడబోతే కోటలు దాటుతయ్, అడుగులు గడపలు దాటవు యీ వూళ్ళను జూసెబోయినా– చిన్నోళ్ళ దగ్గర్నించి పెద్దోళ్ళ దాకా—వొకటే మాటగందా! యెవుళ్ళకీ అంతు జిక్కకుండా యీమవుద్ది జెప్పండి మీకేంటో అడివి గొడవగా వుంది యిదంతాను యెన్నాళ్ళు జెప్పినా తరగదు బాబూ! మా రాజావు అడిగావు గనక జెపుతున్నా–

"మొదణ్ణించీ మా దీవూరు గాకపోయినా పాతలంక శివార్లో పెరిగిందాన్నే కనక కాస్తో కూస్తో తెలియకుండా వుంటుందీ?

సిన్నప్పుడే మా అయ్య జెపుతూవుంటే వాళు యీ వూరి సంగతులన్నీ ఈ తిరప తయ్యగారి తాతల్నాటినించీ ఆడికన్నీ ఆకళింపే అసలు పెద్ద పాలేరుకిందే అట్ట పెట్టుకోవాలని వాళ్లింతో కాపేసి జూశారు కాని రెక్కలమ్ముకు బతికినా నిజాయితీగా బతగాలని ఆడి పట్టుదల ఇదంతా యెందుకు జెవుతున్నానంటే ఆ నాటినించే యీ వూళ్లో పెబువులంతా వొకళ్లు ఏటికి లాగితే యింకోళ్లు కోటికి లాగేవోళ్లు వొకళ్లు మంచిపని జేసినా యిష్టం లేకబోతే యింకోళ్లు అందులో దుమ్మొయ్యడమే

"మా అయ్యని పాలేరుగా అట్టి పెట్టుకోవాలని తిరపతయ్యగారి బాబంటే, 'ఆడు దొడ్లో అడుగెడితే ముంప నాశన మౌతుందని,' నారాయణప్పగారు పుల్లింగాలు జెప్పడం సాగించాడు ఎందుకనంటే తన దగ్గిర రెండు పుల్ల పందుంగింజల డిగి యీరికి యేదుంగింజలు తక్కువగా వొప్పుతున్నాడని అయితే దానికి కారణం లేదంటారా? దానికి తగ్గట్టే యిక్కడ పనీ తగ్గిందిగా!

"అదీ గాక యీడితో బేరాలాడుతుండగానే నారాయణప్పగారి పాలిట్లో గురకరోగంతో ఆవుదూడ సచ్చిపోయింది అదో వొంక దొరికిం దాయనకి దాంతో యిక్కడా-అక్కడా కూడా కవతం పుట్టించి. అయితేమటుకు యెట్టాగో పేగులు మూటగట్టుకుని చాకిరీ జేసుకుని పొట్టోసుకుంటూ బతగలే దంటారా?

"చివరికి నన్ను తీసుకొచ్చి యీ వూళ్ళోనే యిచ్చారు కొన్నేళ్ళపాటు ఏం వున్నామో మా కడుపు చేతబట్టుకు యెక్కడికో పోయాం మా మానాన మేం బతికాం

ఇవ్వన్నీ యేనాటి సంగతులు!

"అప్పణ్ణించీ నాకంతా ఆకళింపే అను కోండి ఇన్నాళ్లకి మళ్లీ యీ వూరొచ్చి యీ పంచలో పడుండా ల్నొచ్చింది సీపురు చేతబట్టుకుని యీదులు తుడవాల్సొచ్చింది అయిపోయింది మా రోజులూ దగ్గిర పడ్డాయని జెప్పాగా

"అదేం బగమంతుడి మహత్తో గానీ యీ గడ్డమీద మాత్రం మేం బతకలేం బాబూ! ఆంబోతులు, ఆంబోతులు పోట్లాడుకుంటూంటే లేగదూడొచ్చి కాటి మధ్యబడి సచ్చినట్టుంది మా బతుకు ముందర యీ పిచ్చిబాబుతో యెట్ట జచ్చేది?"

"ఆ సంగతి ముందుగా జెవుదూ" అన డిగాడతను

(47-వ పేజీ చూడడిం)

# ఉద్యోగాలు

## శ్రీమతి వి. అలివేలుమంగమ్మ

ఆరోజున మూర్తి సన్నగా తల దువ్వుకొని శుభ్రమైన దుస్తులు ధరించి రిక్షాలో వెడుతున్నాడు అప్పుడే గోపాలం, నేను హోటల్ మెట్లుదిగి బజార్లోకి వచ్చాం నా ప్రాణస్నేహితులలో ఒకడవటంచేత మూర్తి నన్ను చూచిన వెంటనే రిక్షా ఆపి, సెయింటుకేథరీన్ మిషనరీ హైస్కూలులో లైబ్రరీన్ పోష్టు ఖాళీవచ్చిందని తెలిసి అక్కడికి వెడుతున్నానని చెప్పాడు

మూర్తి పూర్వగాథ కొంచెం వినండి మూర్తి అమలాపురంలో జన్మించాడు తండ్రి వెంకావధానులు పౌరోహిత్యాలు చేస్తూఉండేవాడు తీరికగా ఉన్న సమయాలలో నీళ్ళ కావిళ్ళు మోసి కూడ నాలుగురాళ్ళు సంపాదించేవాడు వెంకావధానులు తండ్రి, తాత తరతరాలనుండీ ఈవృత్తులుచేసి బ్రతికినవారే మూర్తి తండ్రి వెంకావధానులు ఉత్తముడు,మాయామర్మం తెలియని అమాయకుడు అయితే ఆయన ఒకే పట్టుదలపట్టాడు తన కొడుకు తనలాగు నీచజీవితం గడపకుండా దర్జాగా బ్రతికేలాచేయాలని అందుకని ఆయన మూర్తికి ఇంగ్లీషు చెప్పించాడు చదువుకుగాను ఆయన తిరిగిన ఊరుతిరగకుండా యాచించేవాడు ఎక్కడ ఎంత దూరంలో శుభకార్యం జరిగినా కాలినడకను వెళ్ళి సంభావన పుచ్చుకొనేవాడు ఇలా తన యావత్ శక్తినీ ధారపోసి మూర్తికి తండ్రి చదువుచెప్పించాడు తన కష్టానికి ఫలితంగా ముందు ముందు తన కొడుకుతో రెండురెట్లు ఎక్కువ సుఖము అనుభవించవచ్చునని వెంకావధానులుకలలు కన్నాడు

జన్మతః చురుకైన వాడవటంచేత ఇరవైయేళ్ళువచ్చేటప్పటికే మూర్తి బి ఏ డిగ్రీ సంపాదించాడు

అయితే ఇరవై సంవత్సరాల కష్టానికి ఫలితంగా వెంకావధానుల దేహయంత్రం అరిగి శిథిలమై చివరకు మూర్తి ప్యాసయిన సంవత్సరమే ఆయనకన్నులు మూసి శాశ్వత విశ్రాంతిని పొందాడు

ప్రపంచంలో ప్రతిమానవుడు పూటకి అనుదినమూ ఎంత కష్టపడుతున్నాడో మూర్తికి ఇప్పుడు తెలిసింది తన చదువు కోసం తండ్రిపడిన కష్టాలను తలచుకొని ఎంతగానో బాధపడ్డాడు ఎంత బాధపడితే నేమి లాభం, తన జీవనోపాయానికి ముందుదారి చూడాలనుకున్నాడు మూర్తికి ప్రపంచంలో "నా" అని ఒక్కపూట ఆదరించి గుప్పెడు మెతుకులు పెట్టేవారు లేరు ప్రపంచంలో తనూ తన డిగ్రీ మిగిలినాయి వెంటనే ఉద్యోగప్రయత్నం ప్రారంభించేడు ఇంతవరకూ కాలేజీలో చదువుతూ బయటి ప్రపంచంతో సంబంధము పెట్టుకోని మూర్తికి ఇదంతా అగమ్యగోచరంగా తోచింది చదువుతున్న కాలంలో వర్ణభేదం చాలా తప్పనీ ఏవిషయంలోనైనా అర్హతను, అవసరాన్నిబట్టే చూడాలిగాని కులాన్నిబట్టి చూడకూడదని గాఢంగా నమ్మి, తోటిమిత్రులతో వాదించిన మూర్తికి తీరా తన ఉద్యోగప్రయత్నం చెయ్యబోయేసరికి మనదేశంలో బ్రాహ్మణ, అబ్రాహ్మణద్వేషాలు ఎంతలోతుగా వేళ్ళుపాతుకున్నాయో తెలిసింది ఒక మ్యునిసిపల్ హైస్కూలులో ఖాళీవచ్చిందని తెలిసి ఆ ఊరికమీషనర్ని చూడటానికి వెళ్ళాడు మూర్తి వెళ్ళగానే కమీషనర్ చూస్తున్న కాగితాలు అవతలపెట్టి కూర్చోమని ఆహ్వానించారు దరఖాస్తు చూడకుండానే "మీరే కాలేజీలో చదివారు"అని అడిగాడు మూర్తి జవాబు చెప్పాడు ఆ కాలేజీని గురించి, ఇతరవిషయాలనుగురించి పరిచయస్థులవలె మాట్లాడుకున్నారు చివరకు కమీషనర్ అడిగాడు "మీకేస్టు ఏమి"టని "బ్రాహ్మిన్" అన్నాడు మూర్తి ఈమాటవినటంతోనే కమీషనర్ ముఖం చిట్లించుకున్నాడు ఇంతవరకూ స్నేహంగా మాట్లాడినవాడు ఇప్పుడు "అప్లికేషన్ ఇచ్చి వెళ్ళండి" అని మాత్రం అన్నాడు

ఒక్కమాటతో ఇంతమార్పు ఎంచేత వచ్చిందని మూర్తి ఆశ్చర్యపోయాడు ఆ ఆశ్చర్యం ఆ ఆఫీసులో పనిచేస్తున్న తన పూర్వపుక్లాసుమేటును కలుసుకొని మాట్లాడేదాకా తగ్గలేదు ఆ కమీషనరు బ్రాహ్మణులు పూర్వకాలంలో తక్కిన కులాలవాళ్ళను చదువు చదవకుండా హింసించినందున యిప్పుడు మిగిలిన అన్ని కులాలూ కలిసి బ్రాహ్మలమీద పగతీర్చుకోవాలని అంటూ ఉంటాడని తెలిసింది పూర్వులు చేసినతప్పులకి వారి సంతతిని బాధపెట్టటం ఏమి న్యాయమో మూర్తికి అర్థంకాలేదు నిరాశతో ఇంటి ముఖం పట్టాడు

ఇంకొకసారి ఒక కమిటీ కాలేజీలో ట్యూటర్ పని ఖాళీవచ్చిందని తెలిసింది కాలేజీ కమిటీమెంబర్లంతా బ్రాహ్మలనీ, బ్రాహ్మడికి తప్పక ఉద్యోగం దొరుకుతుందనీ అందరూ చెప్పారు ఆశతో కమిటీ చైర్మన్ గారి దగ్గరకు వెళ్ళాడు చైర్మన్ గారు ముఖం చూడటంతోనే మూర్తి బ్రాహ్మిన్ అని తెలుసుకున్నారు నెమ్మదిగాను, మర్యాదగానుమాటాడి చేతనైనంత సహాయం చేస్తానని మాట ఇచ్చారు నాయనా మీ ఇంటిపేరేమిటి? వి, అంటే వల్లూరి అనేనా? అని అడిగారు కాదండి

"వేలమూరి" అన్నాడు మూర్తి చైర్మన్ గారు ముఖము ముడుచుకొన్నారు అయితే మీరు వై

"అవునండీ వైదీకులమే" అన్నాడు మూర్తి అప్లికేషను ఆఫీసులో ఇచ్చి వెళ్ళండని ముక్తసరిగా చైర్మను గారు చెప్పారు తర్వాత శాస్త్రికి తెలిసింది ఆ చైర్మనుగారు నియోగినీ, వారికి స్వశాఖ అంటేనే ఇష్టమనీ.

ఒక ఊళ్ళో తాలూకా ఆఫీసులో టెంపరరీ ఖాళీ వచ్చిందనీ, తహశీల్దారు వైదీక బ్రాహ్మడనీ తెలిసింది టెంపరరీవే కన్నీ అవటంచే తహశీల్దారే ఉద్యోగం ఇవ్వ వచ్చునని మూర్తి ఎంతో ఆశతో ఆయన దర్శనానికి వెళ్ళాడు క్వాలిఫికేషనూ అవీ చెప్పుకోవటం అయినతర్వాత "అయ్యా నేను బ్రాహ్మడిని తమ శాఖవాడినే" అని చెప్పాడు ఈమాట పూర్తి కాకముందే తహశీల్దారు ఉగ్రరూపందాల్చి తనచేతిలో కాగితాలకట్టను మూర్తి ముఖంమీద కొట్టి *You Rascal* నీ *Merit* ను బట్టి ఏడవాలి గాని మాటిమాటికీ శాఖశీలింగు తీసుకు వస్తావెందుకు ? *Getout*" అని బంట్రోతుని పిలిచి బయటకు సాగనంపాడు తర్వాత తెలిసింది ఆ తహశీల్దారు సంస్కారపు అభిప్రాయాలు కలవాడనీ వర్ణభేదమంటే మండిపడతాడనీ

ఆరోజు సాయంత్రము మూర్తి షికారుగా సముద్రపు ఒడ్డుకు వెళ్లాడు అతనికి జీవితంమీద విరక్తిపుట్టింది బ్రాహ్మడై పుట్టినంతమాత్రాన స్కాలరు షిప్పులమీద చదువుకుందుకు వీలులేదా ? ఎలాగో ముష్టి ఎత్తి చదివితే అర్హతకు తగిన ఉద్యోగాలు కూడ ఇవ్వరా ? ఆస్తులున్నవాళ్ళకు ఫర్వాలేదు ఏ ఆధారమూ లేని బీదవాళ్ళ గతి ఇటువంటి కరువురోజులలో ఏం గావాలి? బ్రాహ్మడై పుట్టినంతమాత్రాన ఆకలిదప్పు లుండవా ? ధనవంతు డౌతాడా ? ఏళ్ల అభిప్రాయం అని బరువైన హృదయంతో అనేక విధాల ఆలోచించాడు. చాలా విరక్తుడై నీకష్టాలను తీర్చుకో అన్నట్లు కెరటాలు పొంగాయి

భగవంతునికి అందరూ సమానమే అని పాడుతూ షికారు చేస్తున్న సాల్వేషన్ఆర్మీ వారి పాట మూర్తికి వినపడింది వెంటనే మూర్తికి ఒక ఆలోచన తట్టింది క్రిస్టియన్ మతంలో కులభేదాలు లేవు ఉద్యోగాల్లో ప్రిఫరెన్సుకూడా ఇస్తారంటారు వెంటనే సమీపంలో నున్న ఛర్చికెళ్ళి క్రిస్టియన్ మతం స్వీకరిస్తానని అక్కడ ఉన్న ఫాదరీతో చెప్పాడు.

మరుచటిదినం మూర్తికి బాప్టిజం ఇచ్చి వైను త్రాగించారు అతనికి మతంమీద దృష్టిలేదు రాబోయే ఉద్యోగంమీద ఉంది. అతనికి మతం స్వీకరించటం ఒక

(22-వ పేజీ చూడండి)



# సెక్సుతో చెలగాటం

స్కూళ్ల ఇనస్పెక్టరు రామనాథం గారికి ఈ ఊరు బదిలీ అయింది. తాను బ్రాహ్మణుడు కాబట్టి తత్ సంఘం అవసరమూ, పొరుగూ ఎంతైనా ఉండాలని అతను ట్రయినులో వస్తూనే ఆలోచించుకొని ఉండాలి. లేకపోతే అతిప్రయాసపడి బ్రాహ్మణవీధిలోనే ఇల్లు అద్దెకు తీసికొని స్థిరపడతాడా? అదృష్టవశాత్తూ, అద్దె హెచ్చయినా, ఇల్లు మంచిది దొరికింది రెండు గదులు, రెండు చీడీలు, ఒక కొట్టు, ఒక పెద్ద వంటవసారా, పెద్ద డాబా అంతా సొంత ఇల్లులాగే ఉంది ఇంటిలోనే నుయ్యి ఉన్నందువల్ల ఆడంగులు నీటికి ఇబ్బందిపడవలసిన అవసరము లేదని నిబ్బరపడ్డాడు ఇల్లు దొరకగానే భార్యను, కొడుకు కృష్ణను, పెండ్లయిన

కాబట్టి ఊరుచూస్తూన్నది అని సంతృప్తిపడే వారు అన్ని పట్నాలనుంచీ వేసంగి శెలవలకు స్వగ్రామము చేరుకున్న విద్యార్థులందరికీ అదో పెద్ద కాలక్షేపమై కూర్చుంది. తతీమా విద్యార్థులు అప్పట్లో అంత పట్టించుకోలేదు కాని గిరిరావుమాత్రం సుశీలకళ్లలో దాహాన్ని చూడగలుగుతున్నానే వాడు. ఈ విషయంలో గిరిరావు ఒక విశిష్ట స్థానాన్ని ఆక్రమించుకోగలిగాడంటే తానిదివరకు చదువుకొని జాగ్రతచేసుకొన్న విజ్ఞానమే కారణమై ఉండాలని బుద్ధిఉన్న ఏ ఒక్కడైనా ఘంటాపథంగా చెప్పగలడు

సాయంత్రం బట్టలు వేసికొని గిరిరావు పైకివచ్చేసరికల్లా ఆ అమ్మాయి డాబా ఎక్కేది తానూ పైకిపోగానే డాబా దిగేది రోజూ అదే సీను టేక్, కట్, రిటేక్ అండ్ రికరింగ్ కూడా! ఏ ప్రత్యేకతాలేని గిరిరావు కొంచెము నిరుత్సాహపడ్డాడు

కాని వెంటనే సెక్సువిజ్ఞానం తన బలంతో తోడ్పడ్డది "మేము ఇంత బలంగా సహాయము చేస్తున్నా తిరుగుముఖం పెడ్తున్నావు" అని అతని అంతరాత్మను సెక్సువిజ్ఞానం పరిహసించింది వెంటనే ఆత్మవిశ్వాసాన్ని ముందుకు పెట్టుతూ ఒక కాలు వెనక్కూ, ఒక కాలు ముందుకూ సాచి, చెయ్యి ఎత్తి 'సెక్సుసాహిత్యం సాక్షిగా ఎప్పుడూ, ఏ పరిస్థితుల్లోనూ, ఎక్కడా, ఏవిధంగానూ, ఎవ్వరికీగూడా వెనుదియ్యను ముందడుగే అభ్యుదయప్రబోధ హితబోధ' అని మనస్సులో అనుకొని 'సెక్సు సాహిత్యానికి జై' అన్నాడు ఆ ఆత్మ ఉత్తేజంలో బ్రహ్మాండమైన సెక్సుజ్యోతి తప్పితే మరి మిత్రులెవ్వరూ కనుపించలేదు 'హేజ్యోతీ' అని గట్టిగా అరచి గుడ్డు మిటక

## శ్రీ భమిడిపాటి వెంకటురావు

పదహారేళ్ళ కూతురు సుశీలనూకూడా తీసుకు వచ్చాడు భార్య ఇంటిగురించి తన సంతృప్తిని తెలియజేస్తూ "అంతా మన సొంత ఇంటిలో మసలినట్లే ఉంది" అన్నది ఆమె అట్లా అనకపోతే రామనాథం కళ్లజోడు కంటిపైకి ఎత్తి దించేవాడు కాదేమో!

సుశీల తరచూ డాబామీద పచారు చేసేది ఆదిలో అంతా కొత్తగావచ్చింది



రావు ఒక్కమ్మడిగా అంతపైస్థానము పోవడము పాటివిద్యార్థులందరకూ సహించరాని విషమసమస్యగా పరిణమించింది గిరిరావు ఊరులోలేని సమయంకనిపెట్టి ఒక సభ ఏర్పాటుచేసికొని అంతా సమావేశమయ్యారు తమకు సాధ్యంకాకపోయినా సరే గిరిరావుకు దక్కకుండా చేయడము ఆ తీర్మాన సారాంశము చాలా ప్రతిపాదనలు తీవ్రంగా చర్చింపబడి ఆమోదింపబడినాయ్. ముఖ్యంగా ఈ విషయంలో గిరిరావును నిరుత్సాహపరచి అతని సీప్రయత్నముసుండి విరమించేలా చెయ్యటమే ఈ సభలోని ముఖ్యమైన ఏకైక అసమాన అఖండ తీర్మానం. గిరిరావు చుట్టపుదూపుల నుండి తిరిగిరాగానే నియమితమైన విద్యార్థి పెద్దలిద్దరు చెప్పారు "ఆ అమ్మాయికి పెండ్లయింది రెండుమూడువారాల్లో భర్తవచ్చి తీసుకుపోతాడు. అనవసరంగా అందని పండుకు వృథాశ్రమపడి అందరిలోను నవ్వులాటుకి, కాలక్షేపానికి వస్తువుఅయి విపరీత ఖండనమండనాల పాల్పడి నీకు నువ్వు చిన్నబుచ్చుకోకు"

రించి ఆకాశంవైపు చూసేడు మిత్రులంతా 'మజ్నూ' అని వెక్కిరించి ఎవరిండ్లకు వారు వెళ్లిపోయారు

గిరిరావు యథావిధిగా కార్యక్రమం దిగ్విజయంగా చేస్తూనే ఉన్నాడు మిత్రులు తీవ్రంగా విమర్శిస్తూనేఉన్నారు "పెండ్లయిన భర్తతో కాపరముచేస్తూఉన్న ఆ అమ్మాయికైనా సిగ్గు ఉండొద్దూ అట్లా మెడెక్కి గంతటానికి? ఇంతకూ గిరిరావుకుమల్లే ఆ అమ్మాయికిగూడా విమర్శకులెవరైనా ఉన్నారో లేదో! ఆమె తల్లిదండ్రులకు తెలుసా? తెలియదేమో! తెలియచేయడమెలా?" అని విద్యార్థిబృందమంతా సరైన భోజనవేళకు నిరాహారదీక్షకూడా చేస్తూ, సినీమాహాలుదగ్గర 'టీ' త్రాగి, రాత్రి చెరువుపారని కూర్చునికూడా ఆలోచిస్తున్నారు

"అదికాదండీ వాడిదగ్గర కొన్ని మంచి పుస్తకాలున్నాయి—వాటిలో—స్త్రీ పురుషుల మనః ప్రవృత్తులెట్లా ఉంటాయి—ఎప్పుడు మారుతుంటాయి—ఏ స్త్రీకి ఏ పురుషుడు ఎట్లాఉంటే నచ్చుతాడు?—

స్త్రీ ఇష్టపడ్డదో లేదో తెలుసుకోవడ మెలాగ ?—వశీకరణ మెట్లా ? ఎన్ని రోజులలో చేయవచ్చు ? అనే విషయంగురించిన గ్రంథ మొకటి వాటిని ఆచరణలో పెట్టేక సందేహాలేమైనావస్తే తీర్చేపత్రికలు కొన్ని ఉన్నాయి” అన్నాడు మిత్రుడు కేశవరావు జగన్నాధరావుగారితో “ఈవిధమైన గారిడీ అంటే ఒప్పుకోనన్నాడు కాశీ ”

ప్రకాశం అడిగాడు “పాము మంత్రం, తేలుమంత్రం ఒప్పుకుంటే సెక్సుమంత్రం కూడా ఒప్పుకోక తప్పద’ని “ఏం, కాశీ, దీనికి నీ జవాబేమిటి,” అన్నాడు రేవిగా నారాయణ అంతప్రశ్న తానే వేసినట్లు

మళ్ళీ కేశవరావు ప్రారంభించాడు “స్త్రీని అర్థంచేసుకోవడ మెలాగ ? అర్థమయ్యాక తిప్పుకోవడమెట్లా ? అనే విషయంగురించి ఆ గ్రంథంలో ఇలా ఉంది స్త్రీ మనోభావాల్ని పూర్తిగా కనిపెట్టాలి స్త్రీకి తనకు ఇష్టమైనవాడు కనిపించిన

చెప్పుకుపోతున్నాడు క్షమించాలి ఆ తరువాత మాటలువ్రాసి ఈ పత్రిక విలువ పాడుచెయ్యటానికి మనస్సంగీకరించకుండా ఉన్నది మీకంతగా కావల్సివస్తే కేశవరావునో నేరుగా గిరిరావునో అడిగి తెలుసుకోండి ఇరవయి సంవత్సరాలేనా లేని గిరిరావునుండి అంత లోకజ్ఞానం రాబట్టగలమా అని సంకోచించనక్కరలేదు గిరిరావూ నేనూ చిన్నప్పటినుంచీమిత్రులం వాడి సత్తువ నాకు బాగా తెలుసు కాశీ మొగం సమాధానపడేవాడిలాగునే కనిపించింది

రోజూ గిరిరావు తానుచేసే యత్నాలు, ముట్టే జవాబులు తన గ్రంథాలతో అన్వయించుకొని సంతృప్తిపడుతూ పురోగమిస్తున్నాడు. ఆ అమ్మాయికి తన అవసరము ఎంతైనా ఉంది అని గ్రహించడానికి అట్టే కాలంపట్టలేదు రామనాధంగారి బంట్రోతు రాజులుతో బాగ పరిచయం అయింది అతనిద్వారా తనకు కావలసినన్ని వివరాలు లాగేడు

“తన వేపే రోజూ చూస్తూ తనకోసరము నిరీక్షించే స్త్రీగురించిన వ్యవహారము నాన్చి, పొడిగించి బాధపెట్టడానికి మనస్సంగీకరించకుండా ఉందని వ్రాస్తూ సాహసిస్తే స్త్రీ ఎట్టి సాహసమైనా చేయగలదని, ప్రణయంలో స్త్రీ తలిస్తే ఎంతటి విషమ పరిస్థితులనైనా అనుకూలంగా మార్చగలదు, అనే కథనుకూడా కలిపి రాజులుద్వారా ప్రణయలేఖ సుశీలకు పంపించాడు.

సినీ కథగాని అతను చదివిన మల్లన్న కథగాని గిరిరావు చదివిఉండడని ప్రాజ్ఞుల అంచనా బహుశా నిజమేఏమో కూడా!

రాజులు జబాబు తీసుకువచ్చాడు ఆత్రుతతో రహస్యంగా చదివాడు గిరిరావు

గిరిరావుగార్కి ! మీరు పంపిన లేఖ అందింది మిమ్మల్ని ఆశపెట్టి నిరుత్సాహపెట్టినందుకు క్షమించండి నాకోసరము ఎంతో మందిని ధిక్కరించి కడకు అభిమానాన్ని కూడా విసర్జించారు కాబట్టి నా జీవితానికి సంబంధించిన రహస్యము చెప్పుచున్నాను నా భర్త నన్ను సరిగా చూచుటలేదు కారణము తెలిసికోవాలని విశ్వప్రయత్నాలు చేసేను తరచు పుట్టింటికి పంపించేసేవారు నా భర్త స్వతహాగా మా నాన్న లోభి అమ్మ రోజూ అడుగుతుండేది—“ప్రధానం నాడు ఒప్పుకున్న కట్నం పూర్తిగా ఇచ్చివేసి అమ్మాయి కాపురము నిలబెట్టండి” అని నాన్నగారు మెదిలేవారుకాదు అమ్మ నా కాపురముగురించి చెప్పినకారణం నాకంతగా నచ్చలేదు

నా భర్త రోజూ పత్రికలు తెచ్చేవారు వాటిలో ‘కామకళ’ పత్రిక నన్ను బాగా ఆకర్షించింద మనస్తత్వ విషయాలూ—ప్రణయకలహాలూ సర్దుబాట్లు—సందేహాలకు సమాధానాలు ‘కామపతి’ని అడగండి అనే శీర్షికలు నాకు నచ్చేయి “నా పెండ్లియినదగ్గరనుంచి నా భర్త నన్ను సరిగా చూచుటలేదు తరుచు పుట్టింటికి పంపించేస్తున్నారు మా అమ్మ అనుకున్నకట్నం ఇవ్వనందున వారలా చేస్తున్నారంటుంది. నాకు మా అమ్మచూపినకారణం అంతగా నచ్చలేదు కాబట్టి మీరెలాగైనా మా సంసారం చక్కబడేమార్గం చెప్పండి” అని నా సందేహంకూడా పంపించాను “మీ భర్తకు మీరు అందంగా కనుపించలేదేమో! అయినా మీరు వీలైనంత బాగా తయారై మీ భర్తముందు మసలండి భయంలేదు. పరిస్థితులు చక్కబడతాయి ఈఇరువయ్యో శతాబ్దం పరభాగంలో కట్నంకోసరం ఎవ్వరూ భార్యను దూరంగా ఉంచరు” అని సమాధానం వచ్చింది

నాకా సమాధానం సంతృప్తినివ్వలేదు “నేను అందమైనదానిని వేషభాషలకు లోటులేదు మరేదైనాపద్ధతి చెప్పండ”ని మళ్లీ వ్రాశాను దానికి సమాధానంగా “మీ అందం ప్రస్తుతానికి కొంత తగ్గవచ్చు అదే మీ భర్తకు తీరనిలోటుగా కన్పిస్తుంది. కాబట్టి మీ అందాన్ని ఇతరులమీద

ప్రయోగించి పరీక్షించుకోండి. ఎవరినైనా మీ రాకర్షించగలిగితే మీ రందమైనవారు. బహుశా మా అంచనా ప్రకారం మీ అందం పరీక్షలో నెగ్గదు. నెగ్గితే మళ్ళీ వ్రాయండి ఇంకో కారణం కోసం మా మన స్తత్వవేత్తలందరూ వెతుకుతారు. మరొ — ఏ సందర్భములోనుకూడా పరపురుషునికి వశమై శీలం పాడుచేసుకోకండి. భారతనారికి శీలం ముఖ్యం పరపురుషుని ప్రయోగశాలలోని ప్రయోగాలికి పనికివచ్చే పనిముట్టుగానే ఉపయోగించుకోవాలి ప్రేమవిషయాలనే పుస్తకం అయిదురూపాయిలు, వి పి ద్వారా పంపిస్తున్నాము మీ రెండు సందేహాలకు రెండు రెళ్లు నాలుగురూపాయిలు, ప్రేమ విషయాలకు అయిదురూపాయిలు, తపాలా ఖర్చులు రూపాయి వెరసి పదిరూపాయిలు వెంటనే జమకడతారని ఆశిస్తున్నాము" అని వ్రాసేరు అదంతా చదివి దండుగ మీ రన్యథా భావించక ఒక భారతనారి సౌశీల్యం కాపాడి ఆమె సంసారస్థితిని పరిదిద్దటానికి ప్రయత్నించే పెద్ద సంఘసంస్కర్తనుకొని నన్ను, నా యీ అపరాధాన్ని మన్నిస్తారని విశ్వసిస్తున్నా క్షమించి ఇక్కడితో మీ ప్రయత్నానికి స్వస్తి చెప్పండి సెలవు, సుశీల

గిరిరావుకి ఒళ్లు మండిపోయింది "తాను ప్రయోగశాలలోని పనిముట్టా? తాను సంఘసంస్కారి అవ్వాలా? తన అవసరమే ప్రధానంకాని ఆమె సంసారస్థితి గొడవ తనకెందుకు," తనకు ఆ పత్రికతో బాగా పరిచయముంది కాబట్టి తన సందేహంకూడా పంపించాడు

అయ్యా, నేను ఒక అమ్మాయిని ప్రేమించాను ఆమె నన్ను ప్రేమించింది [ప్రేమించింది అని తెలుసుకోవటానికి మీ స్త్రీ పురుష మన స్తత్వాలు, వశీకరణ సాధనాలూ అనే గ్రంథాలు సాకంతో ఉపకరించాయి అట్టి పత్రికలు మన తెలుగులో ఉండటం గర్వింపదగ్గ విషయమే అట్టి గ్రంథాలు ఆంధ్ర పాఠకలోకానికి అందించిన మీరు ప్రశంసనీయులు] ఈ మధ్యనే ఆ అమ్మాయి నా ఆశాపూరితమైన ప్రేమలేఖకు సమాధానంగా స్వవిషయమేదో వ్రాస్తూ, నాకు లభింపననీ, ఆశపెట్టినందుకు క్షమించమనీ వ్రాసింది ఎలాగైనా ఆ అమ్మాయిని పొందుదామని ఉంది మీ అమూల్యాభిప్రాయాన్ని సలహారూపంగా తిరుగుటపాలో పంపిస్తారని తలుస్తాను సెలవు, గిరిరావు

కామకళ పత్రికనుండి జవాబుచేరింది

అయ్యా, మీ సందేహం చేరింది నిఖార్సైన మన స్తత్వవేత్తలచేత నూటయ్యే సమాధానం ఇందుతోపాటు పంపించేము అది మీకు పూర్తి సంతృప్తి నిస్తుందని భావిస్తాం "ఏ స్త్రీనైనా మా సిద్ధాంతాలు అంగీకరించేవరకూ తీసుకురావటం బహుప్రయాసం మా కృషిని సార్థకముచేసిన మీ కృషికి మా ధన్యవాదాలు మీవంటివాళ్ళవల్లే ఈ పత్రికలూ, మా గ్రంథాలూ పోషింపబడుతున్నాయి అందరూ నిందిస్తూన్న తెలుగుదేశంలో మీవంటివారు మా కండగా ఉండబట్టి ఇంత దిగ్విజయంగా ప్రజాసేవ చేయకల్గుతున్నాం.

సమయం వచ్చేసరికల్లా బెట్టుసరిచేయటం స్త్రీజాతి ముఖ్యలక్షణం అప్పుడు పురుషుడు ధైర్యాన్ని చిక్కబట్టుకొని ముందడుగు వెయ్యాలి మీవేపుచూసి నవ్వి దుస్తులు చేసిన స్త్రీ మిమ్మల్ని పూర్తిగా ప్రేమిస్తున్నదని నిశ్చయంగా చెప్పగలను. ఈ విషయంలో పూర్తిగా మీ మానసత్వాన్ని వినియోగించాలి "కష్టేఫలి" అన్నారుకదా పెద్దలు. మీ లేఖలో బ్రాకెట్లలో మీరువ్రాసిన వాక్యాలు మేము యోగ్యతాపత్రాలుగా ప్రకటించుకొందుకు అనుమతిస్తారని ఆశిస్తున్నాము మీరు సఫలీకృతులయ్యాక మాకు మీ స్వదస్తూరితో తెలియచెయ్యండి విజయీ భవ!
సెలవు, కామరతి

ఈ సమాధానం చేరేలోగా రామనాథం గారి అల్లుడువచ్చి సుశీలను తీసికొనిపోయేడు గిరిరావుకి రెండున్నరప్రాణాలు గాలిలో ఎగిరిపోయాయి అయినా 'పండగకు రాకపోతుందా!' అని ధైర్యంతో మనస్సు స్థిమితపరచుకొన్నాడు

పెద్దపండుగతోపాటు సుశీలకూడా వచ్చింది ఈ మధ్యకాలంలో గిరిరావు తన మానసత్వం ఏవిధంగా వినియోగించుకోవాలో ఏవిధంగా సార్థకం చేసుకోవాలో ఆలోచించుకున్నాడు పండగవెళ్లిన ఒక నెలవరకూ అతనికి వీలుచిక్కలేదు ఆమెను దిగబెట్టిన భర్త పండగవెళ్లిన మర్నాడే వెళ్లిపోయినప్పటికీ, ఒకనాడు ఊసుపోక కామకళ పత్రిక తిరగవేశేడు.

పూర్వం రణనీతి, రాజనీతి క్షత్రియులకు బోధించేటందుగ్గాను ఆ కాలపుకవులు మంచి నీతివాదకాలు, యుక్తిసూత్రాలు సూక్ష్మంగా సమీక్షించి జంతువులపరంగా కథలుకల్పించి ఉద్గ్రంథాలను రచించారు ఈ కాలంలోకూడా రచయితలు నేటి సమాజమునకు, యువతీయువకులకు పనికివచ్చే ఎన్నో విషయాలను ప్రజలకర్థమయ్యే భాషలో కథలరూపాన చెప్తున్నారు. అయితే వీరు ధైర్యంగా నూతనపద్ధతి నవలంబించి మనుష్యులపరంగానే చెప్తున్నారు

గిరిరావును 'కామకళ'లోని ఒక కథానిక బాగా ఆకర్షించింది ఆ కథలో మంచి చలికాలం చలి నరాలను పీక్కుతింటుంది విమల భర్త వారం రోజులబట్టి

కేంప్ వెళ్లాడు నెలరోజుల బట్టి ఆమెతో మనసిచ్చి మాట్లాడే తీరిక లేకుండా యున్నారు భర్త ఎడబాటు-చంద్రుడు చేసే అల్లరి-ప్రకృతి చేసే విప్లవం-చలిచేసే దౌర్జన్యాలకు విమల తట్టుకోలేకపోయింది. ఈ విధంగా నడిచింది కథ రచయిత ఇతివృత్తంకంటె శిల్పానికే హెచ్చుప్రాముఖ్యత నిచ్చి వాతావరణం కూడగట్టుకొన గలేవటకు వర్ణించి, ఇతివృత్తాన్ని బలపరచి విమలను సమర్థిస్తాడు

గిరిరావుకు కథ అంతా ఒక ఎత్తు ప్రక్కింటి రవణారావు అనే యువకుడు ఆ కథలో విజయం పొందటం ఒక ఎత్తుగా కనిపిస్తుంది గిరిరావు హుషారుగా అడుగు లేస్తూ రాజులును పిల్చివారింటిలోని క్రమం కనుక్కున్నాడు అవతలి గదిలో సూపర్‌వైజరుగారి భార్య, ఇవతలి గదిలో సుశీల, అన్న కృష్ణపడుకుంటారని తెలుసుకున్నాడు అతని ధైర్యములా ఆ కథానికలోని విమలలాగే సుశీల కూడా భర్త ఎడబాటుతో ఒంటరిగా ఉందని, పైగా చలి గాబరా పెట్టులోంది, ఈసారి లాంగ కేమవుతుంది ? ఒక గడియ రాజులు, గిరిరావు గుసగుస లాడుకున్నారు

ఒకనాటి రాత్రి రెండవఆట సినీమాకు గిరిరావు కృష్ణను కూడ బలవంతముగా తీసికొనివెళ్లి తానే టిక్కట్లు కొన్నాడు ఇద్దరు ఒకరిప్రక్కన ఒకరు కూర్చున్నారు ఆట అరవసినిమా చాలా పెద్దది అయినా బాగుంటుంది ఒకరీలుఅయి లైటు వెలిగే సరికల్లా కృష్ణకు గిరిరావు కన్పించలేదు మళ్ళీ ఆట ప్రారంభించారు వాడే వస్తాడనుకొని కృష్ణ ఆటలో లీనమైనాడు

రాత్రి కచేరీ నుండి పన్నెండు గంటలు వినిపించేసరికల్లా రామనాథంగారి తలుపులు వాటంతటవే విడటం ఒక ముసుగు మనిషి లోపలకు వెళ్ళటం జరిగింది వెళ్తూనే దీపం హెచ్చించి సుశీలను తట్టేడు

"ఇక్కడికి ఇంత రాత్రప్పుడు ఎలా వచ్చారూ !" అడిగింది సుశీల భయంగా

"ప్రణయజీవులకు ఎప్పుడూ ? ఎలాగా ? అనే సమస్యలే ఎదురోక్కవు" చెప్పేడు

"ఎందుకు వచ్చారు ?"

"చలి నిన్ను బాధిస్తున్నాది కదూ ? అందుకు ! మరేం భయం లేదు వెధవచలి నన్ను చూస్తేనే పారిపోతుందిలే"

"దయ వుంచి కొంచెం విపులంగా చెప్పండి"

"ఆశ్చర్యంగా ఉంది ! కాముకళ పత్రికతో అంత పరిచయం ఉన్న నీకు ఇంత స్వల్పవిషయం ఇంకా అర్థమవ్వలేదూ ?"

"ఓహో ! అదా సంగతీ ఆ వెధవ పత్రికసంగతి నెత్తకండి నేనే పార బడ్డాను అదంతా ఉత్త వ్యాపారం అప్పుడే మా నాన్నగారు, మావారికి ఒప్పుకున్న కట్నం ఇచ్చివేసేరు అప్పుడు నన్ను వారు తీసికొనివెళ్ళేరు మళ్లీ పండక్కి తీసికొని వచ్చారు ఇప్పుడు వారెంతో ఇదిగా ప్రేమిస్తున్నారు మీరు వెళ్లిపొండి"

'ఊహూ-నన్ను నువ్వు మభ్యపెట్టలేవు చూడూ అస్తమానం బెట్టుసరీ చెయ్యకు శృంగారానికి భంగం వస్తుంది' అన్నాడు ముందడుగు వేస్తూ

'ఆగండి-నేనుచెప్పేది నిజం ఈ పత్రికలవల్లే మనం చెడిపోతున్నాం నాకు బాగా బుద్ధి వచ్చింది వెళ్లిపొండి హద్దు మీరితే ప్రమాదం'

"ప్రమాదం మనలను దూరం చేయలేదు ఇంతకూ నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా లేదా ?" అడిగాడు

"కర్మం మిమ్మల్ని ప్రేమించడమేమిటి బుద్ధి" "బుద్ధి గడ్డి తిని ఆ రోజుల్లో మీ వేపు చూసేను అందుకనే ఇంతవరకు సహించేను వేగం పొండి"

'నీ అందాన్ని నువ్వు పరీక్షించుకున్నావు నా మానవత్వాన్ని నేను పరీక్షించుకోవాలి' అన్నాడు కటువుగా, ఇంకా దగ్గరగా వెళ్లి చెయ్యి పట్టుకొని

"దొంగ ! దొంగ !!" పెద్ద కేకలు గిరిరావు తలమీద రెండు బలమైన లాఠీ దెబ్బలు అంతే స్పృహతప్పి పడిపోయేడు

మరునాడు తెలివి వచ్చేసరికల్లా పెద్దాసుపత్రి గడియారం ముళ్లు రెండూ 12అంకె మీద సమా వేశపడ్డాయి నీరసంగా 'అమ్మా!' అన్నాడు బాధతో.

"బతికేవురా నాయినా !" అన్నది. అతని మీదపడి తల్లి కంటినీరు దిగజారుస్తూ,

"డాక్టర్ సాబ్ ! మా వంశవృక్షాన్ని నిల్పారు మీ మేలు జన్మలో మర్వలేను మీ ఋణం ఎలా తీర్చుకోగలను' అన్నారు గిరిరావు నాన్నగారు డాక్టరుగారి కాళ్ళ మీద వ్రాలి 

నాటిక:

# హెడ్ మాష్టరు గదిలో

## శ్రీ గొల్లమూడి గోపాలకృష్ణమూర్తి

ఇది కేవలం కల్పితం బుజాలు తడుముకొనేవారికి అంకితం

[హెడ్‌మాష్టరు గది H M టేబుల్ ఎదురుగా రైటర్ టేబుల్ రైటర్ టేబులుపైన షెల్ఫు ఉండటంవలన ఒకళ్ళకొకరు కన్పించరు ఆ గదిలో ప్రస్తుతం రైటరు ఒక్కడే ఉన్నాడు ఇంతలో ఒక సైన్సు మేష్టరు ప్రవేశం పేరు రామారావు]

రా ఇంకా రాలేదండి? ఆయన ఏడండి!

రై ఎవరండి?

రా వారేనండి

రై ఎవరండి మీవారు క్షమించండి మీకొక్క తలసినవారు

రా (ఖిన్నుడయి) హెడ్‌మాష్టరుగారు

రై కొత్తగా అడుగుతారేం రోజూ మామూలేగా వచ్చినట్లయితే ఈ గది ఇంత ప్రశాంతంగా ఉండేదేనా. దేనికండీ అంత ఆదుర్దా?

ఉన్నదే అది ఒక్కటి [పార్టుహ్యాండు మేష్టరు శేషగిరి ప్రవేశం]

శే మేష్టరుగారి చేతిలోకి రావటమూ వగలకుండా ఉండటమూ!

రై ఊరుకోండీ మూలిగే నక్కమీద తాటికాయలా మీరు

శే సరే నాకెందుకూ, ఇంతకూ ఈ H M రాలేదా, ఎందుకు వస్తాడు

రై ఇవాళేం కొత్తగనుకనా

శే ఇతరులు ఆలస్యమయితే విరుచుకు పడతాడు తను పక్కనాడయినా టయిముకువచ్చిన పాపానపోయి ఎరగడు నన్ను నిన్న సాయంత్రమే కలుసుకున్నాడు ఇంతవరకూ దిక్కూ మొక్కుం లేదు

రై నిన్న సాయంత్రము ప్రసిడెంటు గారిదగ్గరనుంచి కబురువస్తే

శే వస్తే స్కూలులో పనివదిలి పొమ్మన్నారుటయ్యా అంత కాడికి నన్ను రమ్మంటం దేనికి!

రా నవుగుతూ ఏ పనిచేసినా నసిగినట్లుగానే ఉంటుంది

రై ఏమయిందేమిటి?

రా జాగ్రత్త అంటూ 50 మార్లు చెప్పి ఇచ్చాడు చూశారూ అది కాస్తా ఇందాక

రై కొంపదీసి పగల్లేదుగదా, మనకు

రై ఏవోలేండి వచ్చేవేళ అయినది

శే నాకెందుకయ్యా భయం ఆయనను చూచి దడిచేవాళ్ళకిగాని రంగా నే నాకు కబురుచెయ్యి (వెళ్లిపోవును)

రా ఎవరినిచూచండీ ఈ మిడిసిపాటు

రై ఆయనకేమండీ శెక్రటరీగారి అల్లుడు రిక్షా ఆగిందే మేష్టారు వస్తున్నారు

(H M పెద్ద గందరగోళంగా వస్తాడు అంతా హడావిడీ)

H M పోనోయి యూపెకాలకన్నా ఎక్కువ ఇచ్చేదిలేదు, మామూలే అంత ఇవాళేం కొత్తగా మాట్లాడతావేం

ఒరేయి, కోటాయి! ఏడీవాడు ఇదంతా ఎవడు తుడుస్తాడంట కాస్త అలుసిస్తేసరి, నెత్తినఎక్కి కూర్చుంటారు

(ఇతరులు గదిలో ఉన్నారనికూడా చూడడు కోటాయి పరుగెత్తుకుంటూ వస్తాడు)

H M: అథవా ఈ పనిఅంతా నీ బాబుగాడు ఎవడు చేస్తాడనుకున్నావురా, ముందర ఈ టేబులుమీద దుమ్ము దులుపు

(కోటాయి దులుపుతూ, దులుపుతూ H M ని కూడా దులుపుతాడు)

రై: మీకోసం శేషగిరిగారు వచ్చారండి రాంగానే కబురుచెయ్యమన్నారు

H M వస్తేవచ్చారుగానీ ఈ గోలంతా ఏమిటే పరేయి కోటాయి పక్క క్లాసులో ఎవరో చూచిరారా (వెళ్ళి వస్తాడువాడు)

కో నారాయణగారండీ మరి

H M: ఏమిటిరా! ఆయన క్లాసులో ఉండంగానేనా ఇదంతా!

కో: కాదండి ఇంకా రాలేదండి. అందుకని పిల్లలు గోలచేస్తున్నారు గోల చెయ్యవద్దని చెప్పివచ్చానండి.

H M (రాతో) మీపని తరువాత చూద్దాంగానీ ముందు ఆ క్లాసులోకి పోయి రాండి ఆయన వచ్చేదాకా

రా చిత్తం

H M ఈయన ఒకనాడూ టయిముకు రాడుగదా

రై (తనలో) తనువచ్చి దచ్చినట్లు మాట్లాడుతాడు (పైకి) తెలుగుమేష్టారు శెలవుచీటీ పంపించారండి

H M: ఇప్పటికి ఆయన ఎన్నిరోజులు శెలవపెట్టారండి

రై 15 రోజులు కాజువల్ లీవులన్నీ పోను అధికంగా 8 రోజులు

H M ఈయన వ్యవహారం ఏంబాగాలేదు క్రిందటి సంవత్సరం తప్పినవాళ్లంతా తెలుగులోనే కమిటీవాళ్ళతో ఈ సంగతి చెప్పి ఆయనను తీసేయించమంటే వాళ్లు వప్పుకోరాయెను సిద్ధాంతిగారు పేరుపడ్డ కవి ఆయన మనబళ్లో ఉండటమే ఒక ఘనత మన స్కూలు ఒక కవి సార్వభౌముడిని పోషిస్తుంటే మన స్కూలుకు గొప్ప కాదూ! ఆయనేమో తనూ, తన పుస్తకాలూ వాటి ప్రచురణలుతప్ప స్కూలు సంగతే పట్టించుకోడాయెను

రై అడుగోనండి నారాయణగారు వస్తున్నారు

(నారాయణగారు ప్రవేశం)

H M: ఏమండీ మీకు పిల్లలా కెల్లా మీరుగూడా ఇంత ఆలశ్యంగావస్తే ఎట్లా చూడండి కుర్రవాళ్లకంటే అన్యాయంగా ఉందే

నా పిల్లలు ఒకళ్ళిద్దరయితే ఫరవాలేదు నాకు పిల్లలు 82 రు స్వంతపిల్లలయితే వాళ్ళ భారంఅంతా భార్యదే కానీ ఈ పిల్లల చదువు, తిండి సంగతులు అంతా నేను చూడాల్సివచ్చి వీళ్ళవలన నా స్వంతపనులు వెనుకపడుతున్నవి కూడా

H M నేను అనేదేమిటంటే, మిమ్మల్ని స్కూలుకి, వేళకు రమ్మని

నా నేను మనవిచేసేదీ అంతే నాకు బుధ, శుక్రవారాలలో ఉన్న I పిరిడు తీసి, తరువాత ఎప్పుడయినా వేయండని ఎన్నో సార్లు మనవి చేసుకున్నా

H M చూచారూ మీ ఒక్కరికి పిరిడు మార్చాలంటే స్కూలు టైంటేబులు అంతా మార్చాలి అదేం మాటలతో అయ్యేపనా

నా నేనేం, స్వార్థానికేం మాట్లాడటం లేదే నన్ను అసలు ఈ హాస్టలుకు వార్డెనుగా ఉండమన్నదీ మీరే అది కాస్త జ్ఞాపకం ఉంచుకోండి

H M మీరు వార్డెనుగా ఉంటే హాస్టలు బాగుపడుతుందనేగా మిమ్మల్ని ఉంచింది మీరుండబట్టే హాస్టలుకు స్వంత భవనం అంటూ ఒకటి ఏర్పాటయినది

నా ఇదంతా నా కోసంటండీ! చూడండి నేను రాకపూర్వం పిల్లల ముడ్డి క్రిందకు ఒకపీటచెక్క గూడా లేదు నాకు పిల్లలు లేకపోయినా వాళ్ళనే ఎంతో ఎక్కువగా చూచుకుంటున్నా వాళ్ళకు మంచివసతులు కల్గిస్తే బాగా చదువుతారు బాగా చదివితే బాగా ప్యాసవుతారు మన స్కూలుకి మంచి పేరుప్రఖ్యాతులు వస్తవి అని చూస్తున్నా ఇదంతా నాకోసంటండీ

(శేషగిరి ప్రవేశం)

శే ఔనండి, మొన్న S S L C లో మన స్కూలుకు 50% వచ్చిందంటే హాస్టలు వలననే హాస్టలునుంచి వెళ్ళిన 9 మందీ ప్యాసయారు

H M ఏమిటో! మొన్న ఇన్స్పెక్షనులో బాగా చెప్పటంలేదని రిమార్కు వ్రాసిపోయినాడు.

నా ఆ D E O వట్టి వెధవ నేను M A, L T వాడు B A B Ed నామీద రిమార్కు వ్రాయటానికయినా వాడికి తాహతు ఉండొద్దూ నేను బాగా ప్రిపేరయి వస్తే

H M వస్తే అని అనకపోతే ప్రిపేరయి రాగూడదూ!

నా తీరిక ఏదండి హాస్టలు ఒకటి అంటగట్టారుగా

శే ఏదయినా లేకపోయినా దమ్మిడీ ఖర్చుచేయని పోతరాజుచేత 50 వేలు ఖర్చుపెట్టించి బిల్డింగువేయించగలిగాడు ఇంకొకరయితే ఆపని చేయించగలేవారేనా

నా ఇదంతా నాకోసంటండీ

H M సరేలెండి ఈసంగతి వేరే ఆలోచిద్దాము వెళ్ళి రామారావుగార్ని పంపెంచండి

(నారాయణవెల్లి రామారావుని పంపిస్తాడు)

రా మీతో ఒక మనవి చేద్దామని వచ్చాను నిన్న లాఘుపిరిడులో, -

H M ఆ! లాఘు పిరిడులోనా! ఏమయిందేమిటి

శే ఏమీ కాలా ధర్మామీటరు లాస్టు

H M పోయిందీ, ఎట్లాపోయింది.

శే పగిలిపోయిందండి పాపం మేష్టారి తప్పేమీ లేదు కుర్రవాళ్ళచేత ప్రయోగం చేయిస్తున్నారు అందులో ఎవడో ఒకడు క్రిందకు జారవిడిచాడు

H M (రా తో) ఇంత ఖరీదువి ఎవరినీ ముట్టుకోనియ్యవద్దని చెప్పతే పైగా వాళ్ళచేతులలోనా పెట్టటం మీ బాధ్యత మీరు గుర్తించకపోతే ఎట్లా

శే ఔనండి అందుకనే అట్లాచేశారు మీరు ఆదాచేద్దామంటారు అందుకనేగా చేత్తోపట్టుకుంటానికిగూడా చిక్కని చాక్ పీసులు ఇస్తున్నారు పాపం! లెక్కల మేష్టరు వకటే గోల మీ ఆదా అట్లా ఉంటే వీరేమో ధర్మామీటరు పగలగొట్టి, పాదరసం పారపోసి నష్టం కల్గిస్తున్నారు.

H M (రా తో) అదేమిటండీ ఒడ్డప్పగించి చూస్తారేం—మాట్లాడరేం ఇకనుంచీ మిమ్మల్ని సైన్సుకు తీసివేసి Translation కి వేశాను

శే ఆయనకే మంచిది కొంత బాధ్యత తగ్గుతుంది బాధ్యత లేకుండానే తన జీతం తనకివస్తుంటే పోయిగాదూ పైగా కొంత శ్రమ తగ్గుతుంది ఒకక్కలా వాగక్కరలేదు

H M మీరు మాట్లాడుతారెందుకండీ ఆయన మాట్లాడలేడూ

శే ఆయనేం మాట్లాడగలడండీ మీరు అట్లా తర్ఫీదుచేస్తిరి పాపం! ఆయన ఎంత మంచివాడూ కుర్రవాళ్ళ బాగుకోసరమే ధర్మామీటరు వాళ్ళకి వప్పచెప్పాడు ధర్మామీటరు చూడటం చేతకాకపోతే ఎట్లా ఒకవేళ ఎవడయినా ప్యాసయి, పై చదువులకుపోయి "నాకు ధర్మామీటరు చూట్టం చేతగాదంటే" అది మన స్కూలుకే తలవంపులుగాదా. దానిపేరు దిశదిశలా ప్రాకాలంటే ఇటువంటి ధర్మామీటర్లు ఎన్ని పగలాలో

H M ఔను! ఈ ధర్మామీటర్లతో నా బుర్రగూడా పగిలేటట్లుంది, మీరు వెళ్ళండి రామారావుగారూ (ఆయన వెళ్లును)

శే అసలుసంగతి మరచా నన్నొందుకో రమ్మని కబురుచేశారు నిన్నటినుంచీ మీకోసం తిరుగుతున్నా నిన్నవస్తే ఎవరో పెద్దమనుష్యులతో మాట్లాడుతున్నారు మధ్య అవాంతరంకలిస్తే బాగుండదని

H M దానికేంగాని, మొన్న పేపర్లో చదివాను

శే ఔన చదివే ఉంటారు నేను కాదనటంలేదే

H M: పాంతం వినకుండానే మాటను తుంచేస్తావేమయ్యా!

శే ఆమాత్రం ఊహించలేనుటండీ మీరు చెప్పేది ఏముంటుంది Short hand పెన్సిలు రెండువేపులా చెక్కక్కర్లేదు. అవి ఉపయోగించకముందే విరుగుతున్నవి. ఈ కరువురోజుల్లో పెన్సిలు ముక్కలన్నా ఆదా చేయమని

H M అదే మొన్న ఒక 'Teacher's Report' లో చదివాను

శే నేనూ చదివాను నాకు తెలియకపోతేగా మీరు చెప్పటానికి ఇది చాలా స్వల్పవిషయం మీరు ఇంత చిన్నవ్యవహారాలలో జోక్యం

H M Tagore కి ప్రకృతి సౌంద

(22-వ పేజీ చూడండి)

# వెట్టిచాకిరి

## శ్రీ రెంటాల గోపాలకృష్ణ

"ఏమండీ! ఈవాళ అప్పుడే వచ్చేశారేం?" అంది మీనాక్షి ఆదుర్దాగా సోమసుందరం మాట్లాడకుండా చొక్కా విప్పి వంకీకి తగిలించాడు. "వంట్లో కులాసాగా లేదా?" అంది మీనాక్షి తిరిగి "బాగానే ఉంది" అన్నాడు సోమసుందరం కుర్చీమీద కూర్చుంటూ. "మరైతే ఎందుకొచ్చారు ఇంత త్వరగా ఎప్పుడూ రాలే సినిమాకు వెడదామంటే గూడ తీరదంటారే" అని ప్రశ్నించింది మీనాక్షి తిరిగి పక్కన నిల్చుని. "ఈవాళనుంచీ కావల్సినంత తీరిక, మన ఇష్టం; స్వేచ్ఛగా ఉండొచ్చు పాడు చాకిరీ నాలుగేండ్లనుండి" అన్నాడు సిగరెట్టు ముట్టిస్తూ సోమసుందరం, ఎంతో బరువుతగ్గినట్టు "అదేమిటండీ! అట్లా అంటారేం? ఉద్యోగం మానుకుంటారా ఏం? కొంపతీసి ఆపనిమాత్రం చేయకండి" అంది మీనాక్షి భర్తచేయి పుచ్చుకుని "మానుకుంటారా? కాదు రేపటినుండీ పనిలోకి రావని చెప్పేశాడు సేటుతో" అన్నాడు సుందరం పొగవదుల్తూ "నే నప్పుడే అనుకున్నా ఈ రోజేదో విశేషం ఉందని లేకపోతే మీరెన్నడైనా ఆరుగంటలకు ఆఫీసునుంచి వచ్చారూ? మొదట్లో పదిగంటలుకూడా అయ్యేది ఒక్కరైను ఉండలేకపొయ్యేదాన్ని. ఇదిగో ఈమధ్య గామాలు 8 గంటలకు వస్తున్నారు అయినా మీ వైఖరీచూస్తే నాకేమీ బాగా లేదు ఈమాత్రం గూడా తినడం ఇష్టంలేదా ఏమిటి?" అందిమీనాక్షి ఆందోళనపడ పరుస్తూ "అవును ఇప్పుడు తింటున్నాం బాగా నాలుగేండ్లయింది రక్తం ధార పోశాను పగలనకా, రాత్రనకా, పని చేశారు. దమ్మిడీ ముట్టచెప్పలా. అనుకున్న అరవయి రూపాయిలన్నా కాని అదనంగా ఇవ్వలా ఇదిగో అనీ, అదిగో అనీ, దీపావళీ అనీ, సంక్రాంతి అనీ కాలం జరిపాడు. వెట్టంట, వెట్టి ఫీ ఫీ ఈడబ్బుగలాళ్ళకున్న రోగం ఇదే" అన్నాడు సోమసుందరం ఉద్రేకంగా "మీ ధోరణి నాకేం అర్థం కావటంలేదు మనం జరక్కుండా కుదిరాం. నాలాంటివాళ్ళతే మనకేం? దరిద్రులకోసం ఎవరిమీద పనికొస్తుంది, అట్లాగే లొంగి రోజులు జరుపుకోవాలి గాని" అంది మీనాక్షి భర్తకోపం తగ్గించాలని. "అది కాదు మీనాక్షీ! చూస్తున్నావుగా అన్నీ! అరవయి రూపాయలొస్తే ఏమూలకూ చాలకపోయె ఈ నాలుగు సెల్లనుంచీ పాపపాల కెంత ఖర్చయింది చెప్పు 'పండక్కి మామూలిస్తాను, వచ్చే ఏడు జీతం హెచ్చిస్తాను' అని మాటలు చెప్పి కొట్లో పనికొరతపడకుండా చేయించుకున్నాడు ఎంతకాలం పడను ఈబాధ ఆరోగ్యం చెడిపోయింది అయ్యేదేదో అవుతుంది ఈపని నేను చెయ్యలేను మీనాక్షీ!" అన్నాడు సోమసుందరం వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ భర్త ఎలా కష్టపడుతున్నాడో మీనాక్షికి పూర్తిగా తెలుసు అతనుచెప్పిన మాటల్లో ఒకపాలు కూడా అసత్యంలేదు తనంటే భర్తకు అమితప్రేమ చదువుకుని, విజ్ఞానం కలిగిన భార్యను ఎలా గౌరవించాలో అతనికి తెలుసు అందుకే ఈ కష్టపడటం అంతా తనకోసమే బి.ఏ. ప్యాసై గవర్నమెంటు నౌకరీ దొరక్క మార్వాడీ గుమాస్తాగా చేరాడు సోమసుందరం మానాభిమానాలు చంపుకొని ఈమధ్య సుందరానికి ఆరోగ్యంకూడా చెడింది ఈ స్థితిలో అతను మానుకోవడమే మీనాక్షి కిష్టం. పైకి అలాగా అన్నదేకాని అతని పాలిపోయిన ముఖంచూస్తే భయంవేస్తున్నది ఆమెకు. "ప్రాణాలుచల్లగా ఉంటే బలుసాకుతిని బ్రతకొచ్చు పనిమానేస్తేమానేశారు లేవండీ భోంచేసి విశ్రాంతిగా పడుకుందురుగాని మళ్ళీ పాప లేస్తుందేమో, ఇప్పుడే పాలుపట్టి నిద్రపుచ్చాను" అంది మీనాక్షి ఆలోచిస్తున్న భర్తతో అన్నం ముందు కూర్చున్నాడేకాని సుందరానికేమీ రుచించడంలా భార్య బలవంతంపై పులుసుతో కొంచెం తిని మజ్జిగ పోసుకుని లేచాడు. ఆరాత్రంతా నిద్రపట్టలేదు సోమసుందరానికి ఆలోచిస్తునే ఉన్నాడు గడిచిపోయిన జీవితమంతా అతనికి కండ్లముందు కనపడ్తుంది. చిన్నతనంలోనే తండ్రి పోయాడు. చదువుతూనే రోజుల్లో తల్లికూడా పోయింది వారాలు పెట్టుకొని, చందాలవేయించుకుని కష్టాల్తో చదువు సాగించాల్సివచ్చింది సుందరానికి తండ్రి సంపాయించిపోయిన ఆస్తీ అల్లా చింతాద్రిపేటలో నాలుగుగదుల పెంకుటిల్లు ఒక్కొక్కరోజు ఇంటికూడా వెళ్ళేవాడు కాదు సోమసుందరం కాలేజీ వదలగానే ఎక్కడో స్నేహితులగదికి వెళ్ళేవాడు అక్కడే పడుకునేవాడు ఒకపూట తినీ, ఒకపూటతినకా, కాలం గడిపేవాడు హైకోర్టువద్ద నిలుచొని అభిమానాన్ని చంపుకొని, వచ్చేవారినీ పోయేవారినీ యాచించేవాడు ఇతని స్థితిని గమనించిన కొందరు ధనికులు దయదలిచి చందాలు ఇచ్చేవారు ఇంత చేసినా వచ్చే డబ్బు, స్కూలు ఫీజుకు, పుస్తకాలకూ గూడా పరిపొయ్యేదికాదు.

చిరిగిపోయిన రెండుజతల బట్టలతోనే సంవత్సరమల్లా గడిపేవాడు. పండుగలూ, పబ్బాలూ, కాలేజీలో వార్షికోత్సవాలు, ఎన్నో గడిచిపోయేవి కాని సోమసుందరానికల్లా ఒక్కటే ఆశ ఉండేది తాను ఎలాగైనా B. A ఫస్టుక్లాసులో ప్యాసు కావాలనీ, ఆ తర్వాత తప్పక గవర్నమెంటు ఉద్యోగం వస్తుందని. రోజులు గడిచిపోయినయి. B ౧. క్లాసు పరీక్షలు దగ్గరకు వచ్చినయి. కష్టపడి చదివాడు సోమసుందరం. రాత్రంతా అరకప్పు "టీ"తో ఉండేవాడు. స్నేహితులంతా "యూనివర్సిటీలో ఫస్టున వస్తాడు" అనుకున్నారు. పరీక్ష నాలుగురోజులుందనగా సుందరానికి జ్వరం వచ్చింది "టైఫాయిడ్ కదలటానికి వీల్లేదు" అన్నాడు డాక్టరు ఒక్కసారి క్రుంగిపోయ్యాడు సోమసుందరం ఇంతకాలంనుండీ తాననుకున్న! దేమిటి ? ఇప్పుడు జరిగిందేమిటి ! స్నేహితులు చెప్పినా వినకుండా హాల్లోకి పోయ్యాడు ఏం రాశాడో అతనికే తెలియదు పరీక్షలు అయిపోయినయి ఇరవయి రోజులు మూసినకన్ను తెరవలేదు సుందరం ఇరవై ఒకటోనాడు పత్యం పెట్టించాడు డాక్టరు. సెలవులుగడిచిపోయి రిజల్ట్సువచ్చినయి ఆశతో నిండిన ఆదుర్దాతో పేపరు చేతికొచ్చింది సోమసుందరం సెకండు క్లాసులో ఉంది తన నెంబరు. స్నేహితులనుండి ఉత్తరాలు వచ్చినయి అభినందనాలతో కాని సుందరానికి ఇది వరకటికన్నా ఆదుర్దా ఎక్కువైంది, ముందు ఏమిటి చేయడమని మర్నాటినుంచే ప్రారంభించాడు ఉద్యోగప్రయత్నాలు అన్ని ఆఫీసులూ తిరిగాడు అధికార్లను కలుసుకున్నాడు ఎక్కిన గడపలూ, దిగిన గడపలూ లెక్కలేదు ఆఖరుకు ఎలెక్ట్రిసిటీ



డిపార్టుమెంటులో పనిచేస్తున్న ఒక పాత స్నేహితుడు సెలవు పెడితే అతని సహాయంతో ఆ పోస్టులో చేరాడు అదో రకంగా అయిదు నెలలు గడిచిపోయినయి తిరిగీ మామూలు మనిషయ్యాడు సుందరం మళ్లీ ప్రారంభించాడు ప్రయత్నాలు ఫలితం శూన్యం అయింది ఉద్యోగం ఇవ్వలేని డిగ్రీ దేనికి? ఆలోచించాడు లాభం లేదు అభిమానానికిమాస్తే వీల్లేదు ముందు ఆకలిమంట చల్లార్చుకోవాలి సేటు చందూలాల్ కొట్లో గుమాస్తా పనికి వప్పుకున్నాడు ఒక నెలపని చూచుకొని తరువాత అరవయి ఇస్తానన్నాడు జీతం పనిలో చేరాడు సుందరం ఆ నెల రోజులూ, ఏం తిన్నాడో ఎలా ఉన్నాడో ఎవ్వరికీ తెలియదు క్రమక్రమంగా అలవాటు పడ్డాడు కష్టానికి రాసే లెడ్జర్లకూ, వేసే లెక్కలకూ, అంతులేదు విసుకు లేకుండా పనిచేసేవాడు ఒకొక్క రాత్రి కొట్లోనే పడుకునేవాడు అంతపనిచేసినా ఉద్యోగంలో ఉండే మోజుకొద్దీ ఉత్సాహంగా ఉండేవాడు సోమసుందరం ఇకనైనా పెండ్లి చేసుకోకపోతే ఎన్నాళ్ళు హోటలు తిండి అనుకున్నాడు సోమసుందరం ఒకరిద్దరు పాతబంధువులు హెచ్చరించారు తమ ఇలాకా పిల్లలున్నారని కాని సుందరం మనసు వేరు అతను ప్రేమించగల వ్యక్తి ఒక్కరే లాయరు రాఘవేంద్రరావు కూతురు మీనాక్షి తనతోపాటు స్కూలు ఫైనల్ వరకూ చదువుకుంది విజ్ఞానానికి తోడు సౌందర్యం, ఈ రెంటికీ మించిన విధేయత, మూర్తీభవించి ఉన్నాయి మీనాక్షిలో ఆమె కూడా తనను ప్రేమిస్తున్నదని సుందరానికి తెలుసు అప్పుడప్పుడు పార్కులో కల్సుకుంటూనే ఉన్నారు అతని అనుమానమల్లా ఆమె తండ్రి వప్పుకుంటాడా అని అతను కొద్దో గొప్పో సంబంధం కలవాడు తన స్థితా అధ్వాన్నంగా ఉంది చేతిలో చిల్లిగవ్వ లేదు కూలిపోవడానికి సిద్ధంగా ఉన్న పెంకుటిల్లు తప్ప మరేమీ ఆస్థిలేదు ఏమైనా కానీ, మీనాక్షిని కల్సుకుని విషయం తేల్చుకోవా లనుకున్నాడు సుందరం ఆరోజు ఆదివారం బీచిలో ఇసుకతిన్నెమీద కూర్చున్నారు ఇద్దరూ ముందు మీనాక్షి ప్రారంభించింది ఈ విషయంలో తండ్రికీ, తనకూ, చాలసార్లు వాగ్వాదం జరిగిందని చెప్పింది తింటానికి లేనివాడైనా సుందరాన్ని తప్ప తనెవ్వర్నీ ప్రేమించలేననినీ, తనను ఒహిష్కరించినా ఇష్టమేననినీ, నిష్కర్షగా చెప్పేసిందట మీనాక్షి సాహసానికి మొదట కొంత ఆశ్చర్యం కలిగినా తర్వాత అది సహజమే అనుకున్నాడు సోమసుందరం ఆ రాత్రే ఇద్దరూ కలిసి ఇంటికి వచ్చారు మర్రోజు కబురు పంపాడు రాఘవేంద్రరావు తన మనస్సిక తిరగదని స్పష్టంగా చెప్పేసింది మీనాక్షి తన ప్రేమమూర్తికోసం తల్లిదండ్రుల్ని సహితం పరిత్యజించటానికి సిద్ధపడింది సుందరానికి కాపత్రయం ఎక్కువైంది కొత్తకాపురం చాలా సామాన్లు కొనాలి భార్యకు సరదాతీర్చాలి సేటును అడిగాడు కొంత డబ్బు కావాలని. చందూలాల్‌కు సుందరం అంటే విశ్వాసం ఏర్పడింది తెలివైనవాడు లెక్క తెలిసినవాడు ఇన్‌కంటాక్సు, సేల్సుటాక్సు, చాలా పనులున్నాయి ఎందుకైనా మంచిదని అడగ్గానే అయిదువందలూ ఇచ్చాడు ఖాతాలో ఖర్చువ్రాసి సంతకం చేయించుకున్నాడు సుందరంతో సుందరం ఇంట్లోకి కావాల్సినవన్నీ ఒక్కసారే కొనేశాడు స్నేహితు లందర్నీ పిలిచి ఒక పెద్ద విందుచేశాడు తమ దాంపత్యానికి చిహ్నంగా పార్థసారధికోవెల్లో పండితులు ఆశీర్వదించారు ఇంత జరిగినా కొందరది వివాహమే కాదన్నారు మరి కొందరు మీనాక్షి సోమసుందరంతో లేచి వచ్చిందని వీధులవెంట చాటారు రాఘవేంద్రరావుకు కూతురుమీద కనికరం కలగలా పైగా సుందరం తుచ్ఛుడనీ, త్రాగుబోతనీ, ప్రచారంచేశాడు ఎవ రెన్ని చేసినా, లోకమెంత ఆడిపోసుకున్నా ఆ ఆదర్శదంపతులు లెఖ్ఖ చేయలేదు భర్త ఏ చిన్న వస్తువతెచ్చినా అతి ప్రేమతో స్వీకరించేది మీనాక్షి సంతుష్టిచెందేది సుందరానికి సరదా లెక్కవ చదువుకున్న పిల్ల, ఏమి లోటయితే ఏమనుకుంటుందో అని అతని భయం కొత్త సినిమా వస్తేసరి, రెండో ఆటకు వెళ్లేవారు ఇద్దరూను ఇన్నిటికీ ఏం సరిపోతాయి ఆ జీతం డబ్బులు అప్పుడప్పుడు సేటును అడుగుతుండేవాడు జీతం పెంచమని "వ్యాపారం బాగాలేదు ఈ ఏడు గడవనీయి కొత్త దస్త్రంనాటికి చూద్దాంలే కావాలిస్తే ఖాతాలో ఖర్చువ్రాసుకుని వాడుకో తర్వాత లెఖ్ఖ చూసుకుందాం" అనేవాడు చందూలాల్ అయితే నిజానికి భయదలిచికాదు అతనిలా అనడం, సుందరంతో అతని కెంతో పనుంది ఏవేవో బిల్లులమీద ఇతర్ల సంతకాలు ఇతనిచేత పెట్టించేవాడు ఇన్‌కంటాక్సుకోసం, సేల్సుటాక్సుకోసం, తప్పుడు స్టేటుమెంట్లు తయారుచేయించేవాడు సుందరానికిదంతా తెలుసు చదువుకున్న తాను ఇలాంటి అవినీతిపరుల దగ్గర చేరి తప్పుడు లెక్కలు వ్రాయడమేమిటి! కాకపోతే ఏవిటి చెయ్యడం! ఇదంతా ఎవరికోసం! తన పొట్ట నిండాలి భార్య సుఖపడాలి" అనుకొని తృప్తిపడేవాడు ఇప్పుడు సుందరాని కొక బిడ్డ పుట్టాడు ఈ నాలుగునెల్ల నుంచీ వాడి పాలకోసం గ్లాసో డబ్బాలు షాపులో కొనాల్సివచ్చింది ఈ మధ్య

రెండుమూడుసార్లు సేటుతో తగాదా పడ్డాడు భాగం ఇవ్వమని "ఏం! ఎందుకు అడక్కూడదు? దీపావళి పండక్కి బోనస్సు అంటే ఇప్పుడు కాదన్నాడు పోనీ నా ఖాతాలో ఎంత బాకీఉందో లెఖమాని తీసివెయ్యండి అంటే "తర్వాత చూద్దాంలే" అన్నాడు లాభం ఎక్కువ వచ్చిందికదా ఏదైనా భాగం ఇవ్వండి అంటే, ఇన్కంటాక్సు తనిఖీ కానివ్వండి" అన్నాడు ఈ సంవత్సరం యాభైవేలు లాభంవస్తే లెఖ్ఖలో పదివేలుగా చూపించాడు

తర్వాత పనిఅయిపోయిందనే ధీమాతో 'త్వరలో కొత్తఫరం పెట్టబోతున్నాం, అందులో మీకు తప్పక వాటా ఇస్తాం" అన్నాడు ఇక లాభంలేదు ఈ నౌకరీతో అనుభవంలేకపోగా ఆరోగ్యం చెడిపోయింది ఆరోజో రేపో, పేడో తేల్చుకోవాలని అనుకున్నాడు సోమసుందరం "నాసంగతి తేల్చండి లేకపోతే నేను పని చేయలేను" అని చెప్పాడు సేటుతో ఖండితంగా సెలవు అరవయి రూపాయల చొప్పున మీ జీతంపోగా వాడుకున్న సొమ్ము పదిహేనువందలయింది వడ్డీతో" అన్నాడు చందూలాల్ మార్వాడీ లో ఉన్న ఖాతాబుక్కుచూస్తూ సుందరానికి కాళ్లు వణికినయి కళ్లు చెమటలు పోసింది నరాలు తెంచుకుని నాలుగేళ్లు పనిచేశాడు సంతకాలుపెట్టాడు ఇనప్పెట్టెలకు కాపలాకాశాడు చివరకు తప్పుడు లెఖ్ఖలు గూడా తయారుచేశాడు ఇంత చేస్తే ఇంకా పదిహేనువందలు బాకీ పడ్డానా? అనుకున్నాడు సుందరం గుండెల్లోంచి దుఃఖం పొర్లుకొస్తూ ఉంది తనచుట్టూ మంటలు పెట్టినట్లయింది రేపటి నుండీ పనిలోకి రాను మీరేమైనా చేయండి నాదగ్గర దమ్మిడీ కూడా లేదు" అన్నాడు సుందరం కండువా భుజాన వేసుకుంటూ సేటు తొణకలేదు సమాధానం చెప్పలేదు తొట్రుపడే కాళ్లతో ఇంటికి వచ్చాడు సోమసుందరం గడచిన కథంతా ఒక్కసారి మననంచేసుకున్నాడు పండుకొని తాను కొట్లో పైకం వాడుకుంటున్న సంగతి భార్యకు తెలియదు తాను చెప్పలేదు ఏమనుకుంటుందో అని చివరకిలా పరిణమిస్తుందని ఎన్నడూ తలచలేదు ఎంత సేపు ఆలోచిస్తే మాత్రం ఏం ప్రయోజనం? ప్రొద్దున్నే లేచి ఏం చేయాలో తోచడంలా సోమసుందరానికి నిద్ర రావడం లేదు గడియారం వైపు చూశాడు పన్నెండు దాటింది పక్కలో బిడ్డను పడుకోబెట్టుకుని నిద్రపోతూఉన్న మీనాక్షి ముఖం వైపు చూచాడు కండ్లవెంట నీళ్లు తిరిగినయి "అమాయకురాలు భర్తను ప్రేమించడం తప్ప మరేమీ అక్కర్లేదు" అంటూ చెదరిపోయిన ముంగురులపై చేయి వేశాడు కండ్లు మూతలు పడ్డాయి సుందరానికి కలతనిద్రలో కలగన్నాడు మార్వాడీ తన ఇంటిమీదికి వచ్చి బాకీ కోసం దౌర్జన్యం చేసినట్లు, తన ఇల్లు అమ్మకానికి వేలం పెట్టినట్లు చివరకు చందూలాల్ ఖరీదు చేసినట్లు; కొట్టుకు చే

గుండెతో స్వప్నాన్ని తలచుకుంటూ లేచాడు సుదరం కల నిజమవుతుందా ఏం? అనుకున్నాడు ముఖం కడుక్కొని చొక్కా వేసుకున్నాడు కాఫీ త్రాగి వద్దామని. జేబు తడుముకుంటే అయిదు రూపాయిల ఆరు అణాలున్నయి చిల్లరతో "పాడు డబ్బు నాలుగేండ్లు కష్టపడితే దరిద్రుణ్ణయి బయటికొచ్చా" అనుకుంటూ గడపలో కాలుపెట్టాడు కొట్లో కుర్రాడు "సేటు గారు రమ్మంటున్నారండీ మిమ్మల్ని" అన్నాడు తడుముకోకుండా "దేనికి?" అన్నాడు సుందరం తడబడుతూ ఉన్న గొంతుకతో "ఏమోనండి మునింగారితో అంటున్నాడు పనిలోకి వస్తే సరే లేదా బాకీ పరిష్కారం చేస్తాడా?" అని నాతో మాత్రం మిమ్మల్ని "వెంటఉండి తీసుక రమ్మన్నారు" అన్నాడు కుర్రాడు దీనంగా చొక్కాబొత్తాం సవరించుకుంటూ నిలబడ్డాడు సుందరం ఏం చెప్పాలో తోచలా ఏం చేయాలో తెలియక "సరే! కాఫీ త్రాగి వస్తానని చెప్పు" అన్నాడు కుర్రాడితో తల ఊపుతూ కాఫీ త్రాగుతున్నాడే కాని బుర్ర తిరిగి పోతున్నది సుందరానికి 'పోనీ మళ్ళీ పనిలోకి చేరదామా? ఛీ! పాడు పని వీళ్ళని నమ్మేదెవరు? ఇంక పదేళ్లు చేసినా పావలా చేతికివ్వరు అయితే బాకీ తీర్చేదెట్లా? ఆలోచనలో పడ్డాడు తిరిగి కాస్తా, కూస్తా పదిహేనువందలు ఎక్కణ్ణుంచి తెస్తాడు ఈరోజున తన స్థితికి పదిహేను రూపాయలు కూడా పుట్టవు ఎవర్నయినా యాచిద్దామన్నా బంధువులనుండి స్నేహితులదాకా ప్రచారం చేశాడు రాఘవేంద్రరావు, తాను త్రాగుబోతని, పోకిరినని, అంతటితో పోక సమయంవస్తే కసి తీర్చుకోవాలని చూస్తున్నాడు అవును అతను లాయరు, డబ్బు కలవాడు, అందుకే మర్యాదస్థుడు అతని మాటలు అందరూ విశ్వసిస్తారు ఈ స్థితిలో పెంకుటిల్లు అమ్ముకోవడం మంచిదేమో! కాకపోతే గత్యంతరం ఏమిటి? ఈ ధరల్లో పదివేలయినా వస్తయి బాకీపోగా డబ్బు మిగులుతుంది మీనాక్షికి చీరెలు కొనాలి పాపకొక మంచి చొక్కా అయినా లేదు ఖర్చులకు సరిపడ ఉంచుకుని మిగతా డబ్బుతో చిన్న చిల్లర కొట్టయినా పెట్టుకోవచ్చు అనుకుంటూ ఇంటిముఖం పట్టాడు సోమసుందరం అతని అనుమానాలు చాలా ఉన్నాయి మీనాక్షి ఏమంటుందో కొట్లో ఇంత బాకీ ఉన్నట్లు ఆమెకు తెలియదు వాకిట్లోకి పోగానే

మీనాక్షి అటూ, ఇటూ, చూస్తూ నిలుచుని ఉంది 'ఏమిటి మీనూ' అన్నాడు సుందరం ఆదుర్దాగా 'అతనండీ మీ హెడ్ మునింగారు వచ్చి గదిలో కూర్చున్నారు" అని చెప్పింది మీనాక్షి గాభరాతో. సుందరం గదిలోకి వెళ్లాడు 'ఆబాకీ సొమ్ము తక్షణం చెల్లించుభాయీ! లేకపోతే చిక్కుల్లో పడతావ్ నీతో పేచీపడ్డం సేటుకూ ఇష్టంలేద్" అన్నాడు మునిం టోపీ సవరించుకుంటూ. "ఇల్లు బేరం పెట్టున్నాను ఫయిసల్ చేస్తానని చెప్పు మీ సేటుతో" అన్నాడు సుందరం ధీమాగా పక్కనే నిల్చుని వింటున్నది మీనాక్షి 'ఏమిటండీ ఇదంతా? మీపనులు నాకేమీ అర్థం కావటంలేదు" అంది చికాకుగా "నీకు తెలియదు మీనాక్షి! నీవు వెళ్లు ఈవిషయంలో నీవు జోక్యం కలుగజేసుకోవద్దు" అన్నాడు సుందరం కొంచెం కోపంగా మీనాక్షి మారు పలకలేదు "అచ్ఛాభాయీ! అల్లా చేయడం చాల మంచింది" అంటూ మునిం వెళ్లిపోయినాడు.

తన ముఖ్యస్నేహితులు కొందరికి, తనకు తెలిసిన షావుకార్లకు చెప్పాడు సుందరం తనఇల్లు బేరం పెట్టున్నానని రెండు రోజులు గడిచినా ఎవ్వరూ అడగలేదు కారణం ఏమిటి? పంపూ! పాయఖానా ఉన్నాయి పాతఇల్లు అయితే మాత్రం ఏం? అనుకున్నాడు సుందరం. మూడో రోజు ఉదయాన్నే సేటుగారు వచ్చారు గుఱ్ఱపు బండిమీద మరో ఇద్దరు పెద్ద మనుషులతో "సుందరం గారూ! అయిదువేలకయితే నేనే ఖరారు పడతాన్ అంతకన్నా ఎవరూ పెట్టరు. మీ బాకీ పోను మిగతా పైకం ఇప్పుడే ఇస్తాం" అన్నాడు సేటు సుందరం భుజంమీద చేయివేసి. సుందరం రెండు నిమిషాలవరకూ మాట్లాడలేకపోయ్యాడు బేరగాళ్లు ఎందుకు రాలేదో ఇప్పుడతనికి అర్థమైంది ఈ చందూలాల్ వెళ్లి చెప్పి ఉంటాడు అందరితో పోటీరావద్దని పెద్ద వ్యాపారస్థుడు, లక్షాధికారి అతని మాటకు ఎవరు ఎదురు చెప్తారు ఇప్పుడతనే అడుగుతున్నాడు ధరలో సగం తగ్గించి 'సరే! మీఇష్టం వచ్చినట్లు కానివ్వండి" అన్నాడు సుందరం జీవచ్ఛవంలా నిలుచుని "అగ్రిమెంటు రాయండి" అన్నాడు చందూలాల్, పక్కన ఉన్న పెద్దమనిషితో, కోటుజేబులోంచి నోట్లు తీసి లెఖ్ఖపెడుతూ సుందరం సంతకం చేశాడు ఇద్దరు పెద్దమనుషులూ సాక్ష్యం చేశారు అగ్రిమెంటు జేబులో పెట్టుకుని ముప్పయిఅయిదు వందలూ సుందరానికివ్వబోయినాడు చందూలాల్ ఇంతలో టాక్సీ చప్పుడయింది అందరూ వెనక్కు తిరిగి చూచారు రాఘవేంద్రరావు మరో ఇద్దరు కోర్టుజవాన్లతో దిగాడు. చందూలాల్ కుతప్ప అందరికీ ఆశ్చర్యం కలిగించింది వారి రాక ఫయిల్సులోనుండి దస్తావేజులు తీశాడు లాయరు రాఘవేంద్రరావు సోమసుందరం తండ్రి తనకా ఇల్లు తనఖా పెట్టి బాకీ తీసుకున్నాడని, అది ఇప్పుడు ముప్పయిఅయిదు వందలదాకా అసలు ఫాయిదాలు అయిందనీ, దర్మిలా సుందరం వప్పుకొని రాసిఇచ్చిన దస్తావేజుతోసహా చూపించాడు రాఘవేంద్రరావు సుందరానికి కాళ్లు వణకినయి తన తండ్రి, ఇల్లు తనఖా పెట్టాడా! దస్తావేజుమీద తన సంతకంకూడా ఉందే "అన్యాయం, మోసం" అంటూ కేక లేశాడు సోమసుందరం మీనాక్షి బయటికి వచ్చి బావురుమని ఏడ్చింది భర్తను పట్టుకుని సేటుకు పెంకుటిల్లు, రాఘవేంద్రరావుకు ముప్పయి అయిదువందలూ దక్కాయి

# ఇదిగో పులంటే అదిగో తోక

"ఇదేం చిత్రమోనమ్మా, కాలం యిలా మండిపోతూ ఉంటే యీ పిల్లల్ని ఎత్తుకుపోడమేమిటో తెలీటంలేదు! ఇంట్లో వాళ్లకే బియ్యందొరక్క చస్తుంటే, పిల్లల్ని కూడా కొనుక్కుంటున్నారుట!! మహావిడ్డూరంగా ఉందమ్మా!!!"

"అదేమిటమ్మా సుందరమ్మగారూ! పెంచుగుందికి కాదుటండీ, అదేదో దేశమంటా, ఆ దేశంలో జనాభా చాలదని, అక్కడ గవర్నమెంటు పిల్లల్ని కొంటున్నారుట అందుకనే ఆడా మొగా అనే భేదం లేకుండా ఎత్తుకుపోయి అమ్మేస్తున్నారుట!!"

"మీరు మరీ విడ్డూరంగా అంటారండీ మరీను రమణమ్మగారూ! ఎవళ్ళో బైరాగులుటండీ! ఎత్తుగుపోతున్నారుట!! బైరాగులంతా కలసి అదెక్కడో కాళికాదేవి గుడి కడుతున్నారుట, నెయ్యినొక్కమంది బాలల్ని బలిస్తాం తల్లీ! అని మొక్కుకున్నారుట ఆ గుడి పునాదుల్లో బలియ్యడానికిటండీ! పిల్లల్ని ఎలా కాచుగోడమో తెలియటం లేదు! పెద్దవీధిలో యిద్దరి పిల్లల్ని బస్తాలో కట్టేసి తీసుకుపోయేరుట నిన్న!!"

"అదే మావారూ అన్నారు రాత్రి మత్తుమందు జల్లేసి, బిస్కత్తులు ఎర వేస్తున్నారుట, ఎంత చోద్యమో చూడండి పిల్లలు కదండీ చూడగానే నోరూరుతుంది తినేటప్పటికల్లా స్పృహ తప్పి

* * *

"అమ్మ నాకే బిస్కత్తూ, కాని యియ్యి కొనుక్కుంటాను"

"అబ్బా, ఉండరా"

"నా కాని యియ్యి"

"ఇవుడు కానీ లేదు గినీ లేదు, ఒక్క మాటుండు అన్నం పెడతాను బైరాగులు పిల్లల్ని ఎత్తుగుపోతున్నారుట వీధిలోకి వెళ్ళడానికి వీల్లేదు నువ్వు"

"అబ్బ, నా కానీ యియ్యేవ్,"

"రేపు మీ నాన్నతో చెప్పి తెమ్మంటానులే ఉండు మాట్లాడనీ"

"అయితే నేనూ రేపే వస్తాను."

"ఒరే నానీ, రామం! యిలారా. నా మాట విను, చీకటి పడింది, వీధిలోకి వెళ్లకు వీణ్ని వడు పట్టుగోగలడు బాబూ, నిలబడితేనా, ఏం దారో ఏమిటో."

"భయం లేదండీ, ఇల్లాంటి సందుల్లో కొచ్చి ఎవడేనా అలాంటిపనిచేస్తే వెంటనే దొరికిపోడుటండీ అలాంటి పని యీ రాడీ వీధిలో చెయ్యడానికి ఎన్ని గుండెలుండాలి"

"మీకేమమ్మ పిల్లాపిచిగా! తల్లిప్రాణం ఎలాంటిదో మీకేం తెలుసు!"

"అదేంటండీ, సుందరమ్మ గారూ! అలా అంటారు పిల్లలంటే మాకు మాత్రం ముద్దు లేదుటండీ" మొన్న మా మరదీ వాళ్ళూ వస్తే వాళ్ల చంటివాణ్ని ఉన్న రెండు రోజులూ కింద దింపితే ఒట్టు మా ఆయన అయితే మీ ఆయనే రైటరు గదా మీ కెందుకమ్మ అంత భయం!"

## "చిట్టి"

"రైటరుగారూ, యినస్పెక్టరు గారూ, యీ పదిమంది కానిస్టేబుల్సు యింతఊరునీ కాస్తూ కూచుంటారుటమ్మా? ఏదీ జరక్కుండా చూడ్డం వీళ్లవశమా ఏదేనా జరిగితే అక్కడికి వీళ్ళంతా పరిగెడతారు అంతా అయిపోయిం తర్వాత వెళితే ఏం లాభం! రోగి చచ్చేక డాక్టరు మందియ్యడానికి వచ్చినట్టే "ఉండండమ్మ చీకటి పడింది, ఎక్కడికిపోయేడో వెర్రినాగమ్మ

"ఉండడం కాదమ్మ, వస్తాము మా ఆయన కూడా వచ్చే వేళయింది"

* * *

"ఏమండోయ్, విన్నారా, రైటరుగారబ్బాయినే ఎత్తుకుపోయేరుట! ఎంత చిత్రంగా ఉందో చూడండి ఆరు గంటల దాకా నేనక్కడనేఉన్నాను వాళ్లమ్మని కానీ యిమ్మని అల్లరి చేస్తూనే ఉన్నాడు. "నాన్నగారు రానీరా యిస్తాను" అని ఆవిడ అంటూనే ఉంది కోపం వచ్చి వీధిలోకి పోయేడు మేంకూడా యీ కబుర్లే చెప్పుగుంటున్నాం ఇంతలోనే ఎంత చిత్రం కల్యాణంగారబ్బాయి చూసేట్ట ఎవడో బైరాగి వెనకాతే లడ్డుండ తింటూ వెళుతూంటేను బైరాగివాణ్ణి చూసి వాడు పారొచ్చేట్ట ఊరంతా అనుకుంటుంటే యింకా మీకు తెలీనే లేదా!"

'ఊరంతా తెలిసిందంటున్నావు ఎన్ని" తిరిగొచ్చేవేమిటి యిప్పటికిప్పుడే నువ్వుల్లు

"ఊరుకోండి మీరు మరీను, అందరూ అనుకుంటున్నారన్న సంగతి పూరల్లా తిరిగొస్తే గాని తెలీదా ఏమిటి"

"నేనూ యిప్పుడే విన్నాను, గాని, ఏమిటో నాకేం నమ్మకం లేదు కల్యాణం గారబ్బాయి చెప్పడం, వీళ్లు నమ్మడం, వాడికి వచ్చీరాని జ్ఞానం"

"అవును ఎద్దుపుండు కాకికి నొప్పా! మీకూ నాకు ఏం తెలుస్తుంది పిల్లలులేని వాళ్ళకి"

"ఏమో, నాకేం నమ్మకం కలగడం లేదు, నిజం నిలకడమీద గాని తేలదు మీ ఆడవాళ్లు మరీను, ఇదిగో పులంటే అదిగో తోకంటారు"

"ఊరంతా గగ్గోలెత్తిపోతూంటే మీకు నమ్మకం కలగడం లేదు నిప్పులేనిదే పొగ వస్తుందా!" కానీండి మీరు నమ్మకపోతే యిప్పుడు నాకూ మీకు పోయిందేమీ లేదులెండి మాటవాసి కన్నాను"

* * *

"ఒసేవ్, రమణా! రమణా!..

" "

"రమణా! రమణా! "

"అబ్బ, ఎందుకండి, ఒకటే గోల, పలుకుతూ ఉంటే ఒక్క నిమిషం ఆగితే తప్పా, పెరట్లోంచి రావాలా మరి"

"విన్నావా, నేంచెపితే నమ్మేవు కావు"

"ఏమిటేమిటి?"

"ఉండు కాస్త ఊపిరి తియ్యనీ"

"నేనడిగినకొద్దీ మురిపిస్తారు మీ రు పోనీండి"

"రైటరుగా రబ్బాయిని ఎత్తుగుపోవడం మాట నిజమేనుట"

"నేను చెప్పలేదూ మరి"

"ఏడిసేవ్, ఒకటే గోల, పూర్తిగా చెప్పనియ్యవ్"

'బైరాగి వెనకాతే మిఠాయి తింటూ వెళ్ళడా లేదా? ఇప్పుడే నాఒప్పుగుంటారా?'

"నీ మొహం, ఆ బైరాగి ఎవళ్ళనుకున్నావు, ఆ కుఱ్ఱాడి మేనమామేనట!"

"ఊరుకోండి; వాళ్ళన్నయ్య వచ్చేడని సుందరమ్మగారు నిన్న మాటవానికేనా ఓమాటన్లేదు మేనమామ రావడం ఎప్పుడు ఆ కుఱ్ఱాణ్ని తీసిగెళ్ళడం ఎప్పుడు.

అయితే ఆ వెతుక్కోడం, గోల ఎందుకొచ్చింది?"

"చెప్తాను వినుమరి రైటరుగారు కూడా బజారుకొస్తే అడిగేను ఆయనే చెప్పాడు, ఇద్దరం నవ్వుకు చచ్చేం కుఱ్ఱవాడు వీధిలోకి అలిగివెళ్ళేట్ట, ఆ వీధి కొసనే అందరూ దొంగాటాడుకుంటూంటే వాడు అందులో చేరేట్ట ఇంతలోకే వాళ్ళ మామయ్య ఊరినుంచి వచ్చి "ఒరే రామం రారా" అంటూ యింటికి తీసికొచ్చేట్ట వీళ్లొచ్చేసరికి వాళ్ళమ్మ వాణ్ణి యింటికి పిలవడానికి వీధి అవతలి చివరికి వెళ్లిందిట ఓ ఐదునిమిషాలు చూసేరు, సినీమాకి టైమయిపోతోంది రారా, మీ నాన్నతో చెప్పొచ్చేనులే అని వాణ్ణి తీసికొని సినీమాకి వెళ్ళేట్ట రైటరుగారు కూడా గాభరాపడ్డారుట వాళ్లమామ తెచ్చిన లడ్డుండ తింటూ పెనకాలే సినీమాకి వెళ్ళేట్ట రాత్రి 10 గంటలకి యిద్దరు యింటికి హాజరు మరేమిటి ఈ మాత్రందానికి ఊ, ప్రపంచం తలక్రిందులు చేసేరు"

"శెభాస్, బలే నాటకం జరిగిందన్నమాటే" ★

# ఉద్యోగాలు

(9-వ పేజీ తరువాయి)

కలలాగు జరిగింది బాప్టిజం సర్టిఫికెట్ తీసికొని ఇంటికి చేరాడు

తరువాత రెండురోజులకే సెయింటు కేథరీన్ మిషనరీ హైస్కూలులో ఖాళీ వచ్చిందని తెలిసి తనకీమారు తప్పక ఉద్యోగందొరుకుతుందని సంతోషించాడు మూర్తి

మూర్తి రిక్షామీద సెయింటుకేథరీన్ మిషనరీ హైస్కూలికి వెళ్ళి అమ్మగారు రమ్మనగా లోపలికి వెళ్ళాడు

మదర్ సుపీరియర్ చాలాముసిలిది ఆంగ్లో ఇండియను తెనుగును ఎంతో యాసగా సాగదీసుకుంటూ మాట్లాడుతుంది

మూర్తి దరఖాస్తుచూచి మీదే ఎక్కువ క్వాలిఫికేషనుగల దరఖాస్తు, ఇప్పుడు వచ్చినవాటిలో అంది మూర్తి కాండక్టు సర్టిఫికెటు చూస్తూ మీరు ప్రొటెస్టెంట్లా? కాథలిక్కులా? అంది మూర్తి తన బాప్టిస్టు సర్టిఫికెటు చూచి *Chruch of Ingland* అని చెప్పాడు

"సారీ, మేము కాథలిక్కులకే ప్రిఫరెన్సు నిత్తుము అప్పుడే రెండుకాథలిక్ దరఖాస్తులున్నవి" అని సాగదీసుకుంటూ ఆవిడ అంది

ఆమాట వింటూనే మూర్తి కెవ్వుమని కేక వేసి కుర్చీలోంచి విరుచుకు పడ్డాడు

సుపీరియర్ "వాటర్ వాటర్" అని పరుగెత్తింది

మరునాడు పేపర్లో మూర్తి అనే ఇరువదియేళ్ళ యువకుడు ఉద్యోగప్రయత్నం చేస్తూ ఉండగా హఠాత్తుగా గుండె ఆగి మిషన్ స్కూల్లో చనిపోయాడన్న వార్త పడింది అది చదివిన అతని స్నేహితులు సానుభూతిగా అశ్రు తర్పణంచేశారు

నేనిప్పటికీ జ్ఞాపకము వచ్చినప్పుడల్లా విచారిస్తూ ఉంటాను మూర్తి చనిపోవుటకు కారణం "గుండెజబ్బేనా" అని ★

# హెడ్‌మాష్టర్ గదిలో

(15-వ పేజీ తరువాయి)

ర్యాన్ని గురించి చెప్పబోతా వేమయ్యా- ఇన్నాళ్ళనుంచీ *H M* చేస్తున్నాను ఆమాత్రం నాకు తెలియదా ఇంకొక సం॥ లో రిటయిర్ కాబోతున్నాను

శే అందుకనే, మీకు వృద్ధాప్యం వచ్చింది మీరు పెరిగిన పరిస్థితులువేరు పరిస్థితులు ఎప్పుడూ ఒకలాగుండవు పరిస్థితులతోపాటు మన సత్వంగూడా మార్చుకోవాలి

*H M* తాతకు దగ్గులు నేర్పుతానంటావేమయ్యా! అన్నీ కాచివడబోసిన మనిషినని తెల్సుకో

శే ఇది నీ ఆంతరంగిక వ్యవహారం

*H M* ఆంతరంగికమా! స్కూలుకి సంబంధించినది చిన్నచిన్న వ్యవహారాలలో శ్రద్ధతీసుకుంటేనే స్కూలుకి పురోభివృద్ధి

శే నేనేం ఆమాత్రం తెలియని మూర్ఖుడిని కాదు నా వ్యవహారాలలో నే చెప్పినట్లు జరగాల్సిందే ఇందులో మీ సలహా పాటించవలసిన అగత్యం లేదనుకుంటా

*H M* నేనుచెప్పినట్లు చేయకతప్పదు.

శే నేను చేయను మీకు తెలియనిదే టెక్నికలు వ్యవహారాలజోలికి పోగూడదు తెలియనివాటిని గూడా శాసించే అధికారం మీకు లేదు

*H M* స్కూలుకి పెద్దనినేను నాకు విధేయుడవై ఉండటం నీ విధి

శే ఔను ఆ విషయం నాకు తెలియకపోలేదు మీకు మేమందరం విధేయులమే కానీ ఆ విధేయత అన్ని విషయాలలో మాత్రంకాదు మేష్టరుకు బోధనాపద్ధతులలో కట్టుబాట్లు పనికిరావు ఆయనకు సంపూర్ణమయిన స్వేచ్ఛ అవసరం మీకు తెలియనివిషయాలు కొన్ని ఇతరులకు తెలియవచ్చు పెన్సిలు చెక్కే విధానంతో మీతో ఏకీభవించనందుకు క్షమించండి నేను పిల్లలబాగు గోరేవాడినేగాని చెడగొట్టే ఉద్దేశ్యం కలవాడినికాదు మీతో ఏకీభవించకుండా ఇక్కడ పనిచేయటమనేది స్కూలు డిసిప్లిన్‌కు భంగం నా ఉద్యోగంకొరకు స్కూలుపేరు చెడగొట్టదలచలేదు అందుకని ఇదిగో నా రాజీనామా స్వీకరించండి

H M (పూర్తిగా తగ్గి) ఇంత చిన్న వ్యవహారానికి ఇంత ఆవేశం ఎందుకోయి సరే, నీ ఇష్టంవచ్చినట్లే కానీ స్కూలు పేరుకోసం పాటుపడతానంటే నేను కాదంటానా (శే వెళ్లును) ఒరేయి! కోటాయి, గంటకొట్టరా

కో ఇంకా టయిము కాలేదండి

H M కొటమని నీకుగాదురా చెప్పేది పిల్లలు ఎక్కువసేపు ఆడుకుంటారు ఎంత ఎక్కువగా ఆడితే అంతమంచిది స్పోర్ట్సులో కప్పులన్నీ మనకే వస్తవి అప్పుడు మన స్కూలుకి ఎంతపేరు అంటూ డ్రిల్లుమేష్టరు వస్తాడేమోరా

కో చిత్తంబాబూ (గంటమోత)

H M అంతా పైకి బాగానే కనిపిస్తున్నది అందరూ స్కూలుని ఉద్ధరిస్తామనేవాళ్లే అయితే ఒక్కొక్క మేష్టరుదగ్గర 20 మంది ప్రయివేటు కుర్రవాళ్లు వీళ్లు స్కూల్లో బాగాచెపితే ఈ ట్యూషన్లు దేనికి? నేను చెప్పినట్లు వీళ్లు వినరు వీళ్లు చెప్పినట్లు కుర్రవాళ్లు వినరు స్కూలంటే వీళ్ళందరికి మేజువాణీలాగా ఉన్నది ★

(తెర)

# బొమ్మరిల్లు



## లౌకికజ్ఞానము

శ్రీ కవిరావు

శాస్త్రిగారబ్బాయి
చురుకైన వాడు,
గొప్పచదువరి నంచు
గర్వపడతాడు
ఎదురు పల్కేవారి
నెక్కి రాసేడు,
మాటకున్న మాటతో
మాడ్చి వేస్తాడు.
పట్టణపు నీళ్లొళ్ళంట
బట్టికాబోలు,
పల్లెటూళ్ళన్నచో
పరిహాసిస్తాడు—
మద్రాసులో పట్ట
భద్రుడై పిదప,
వేసంగి సెలవులకు
వేంచేసినాడు
అత్తవారింటి బెం
గత్తెగాబోలు,
దూరానగల పల్లె
టూరుకేగాడు
బస్తీలకోతలె
నోక్కోసి కోసి,
బావమరుదుల ప్రేమ
చూరగొన్నాడు

శాస్త్రిగారబ్బాయి
చదువులం గూర్చి,
ఊరంత అట్టుడికి
నట్టు లుడికింది.

ప్రక్కింటి చంగయ్య
ప్రాంశెరీ నోటు,
లెక్క చూపించుకొన
తెచ్చెనొకనాడు

శాస్త్రికొమరుడు చాల
సేపు లెక్కించి,
చిట్టచివరకు నాత
డిట్టులన్నాడు.

"వేయి రూప్యములనలు
ఫాయిదాలండీ!"
అనగానె చంగయ్య
ఆశ్చర్యమంది,

"ముప్పదైదుకు మించి
మొత్తమవదండి."
అని చిటికలో నోటు
లెక్క గట్టాడు.

"గుడ్డిముండలు జేయు
వడ్డీకి, బావా!
గొప్పచదువులు చదివి
తప్పుచేశావా?"

మెత్తగా మరదలి
మెత్తిపొడువంగ
శాస్త్రిగారబ్బాయి
సిగ్గుపడ్డాడు.

లౌకిక జ్ఞానంబు
లోపించెనేని,
ఎంతచదివిన లాభ
మేముంది మనకు?

# హకల్ బెరీ ఫిన్

## మార్క్ ట్వేన్

బొమ్మరిల్లు సీరియల్

### హకల్ బెరీఫిన్.

### నోటీసు.

ఈరచనలో ప్రయోజనం కోసం వెదికేవారు ప్రాసిక్యూట్ చేయబడతారు; నీతికోసం వెదికేవారు దేశంనుండి బహిష్కరింప బడతారు; ఇతివృత్తంకోసం వెదికేవారు తుపాకితో కాల్చివేయ బడతారు.

గ్రంథకర్త.

## 1

నా గురించి తెలుసుకోవాలంటే మీరు "టామ్ సాయర్" అనే పుస్తకం ముందు చదవవలసి వుంటుంది, చదవకపోయినా అంత ఫరవాలేదు. ఆపుస్తకం మార్క్ ట్వేన్ అనే ఆయన రాశాడు. ఆయన చాలమటుకు నిజమే రాశాడని చెప్పాలి. కొన్ని విషయాలు కల్పించి రాసినా ఆయన రాసింది చాలమటుకు నిజమే. ఆ మాటకొస్తే జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు అబద్ధాలాడని వారెవరు?—పోలీ పెద్దమ్మ, అమ్మగారు, మేరీ తప్పిస్తే? పోలీ పెద్దమ్మ తెలుసుగామీకు? టామ్‌సాయర్‌కు పెద్దమ్మ అవుతుంది. ఆవిడ, మేరీ, డగ్లస్ అమ్మగారు వీళ్లంతా "టామ్‌సాయర్" పుస్తకంలో వస్తారు. ఆ పుస్తకంలో కథ చాలమటుకు నిజమే; అయితే నేనిందాక చెప్పినట్టు అక్కడక్కడ కల్పన లేకపోలేదు.

ఆపుస్తకంలో చివరికేం జరుగుతుందంటే: టామ్‌కూ, నాకూ దొంగలు గుహలో దాచినడబ్బు దొరుకుతుంది; దాంతో మేముఉన్న పళంగా గొప్ప ధనవంతులమై పోతాము. చెరొక ఆరువేల డాలర్లు పంచుకుంటాము. ఆడబ్బంతా ఒకచోట కుప్పగాపోస్తే, చూడండి బాబూ, కళ్లుబైర్లు కమ్మాయంటే నమ్మండి. జడ్జి థాచర్‌గారు ఆడబ్బు నంతటినీ వడ్డీకి బ్యాంకిలో వేశారు. నాకూ, టామ్‌కూ సంవత్సరం పొడుగునా రోజుకొక డాలర్ చొప్పున భత్యం ఇచ్చేవారు. ఆరోజుల్లో డాలర్ అంటే ఏం చెయ్యాలోకూడా తెలియనంత డబ్బన్నమాట. డగ్లస్ అమ్మగారు నన్ను పెంచుకుంటానన్నది; నాకు చదువు గిదువూ చెప్పించి 'మనిషిని' చేస్తానన్నది. కాని ఆమెగారి ఇల్లంత ఘోరం ఇంకెక్కడా వుండదు. శుచి, శుభ్రంమీద ఆవిడకున్నంత పట్టింపు మరెవ్వరికీ ఉండదు. అందుచేత నేను ఆట్టే కాలం ఆయింట్లో వుండలేక పోయాను. మళ్లీ చిరుగు గుడ్డలు కట్టుకుని నా మామూలు చోట్లయిన గడ్డివాములు, పశువులదొడ్లు తిరగసాగాను. కాని టామ్‌సాయర్ నన్ను వదిలి పెట్టలేదు. ఊరంతా వెదికి నన్ను పట్టుకున్నాడు. తనొక దొంగల గుంపును చేరదీస్తానని, అమ్మగారి యింట్లోవుండి నాగరికత నేర్చుకోకపోతే తన ముఠాలో నన్ను చేర్చుకోననీ అన్నాడు. అందుచేత విధిలేక నేను మళ్లీ అమ్మగారి యింటికి పోవలసి వచ్చింది.

అమ్మగారు నన్నుచూసి కళ్ల నీళ్లు పెట్టుకుంది; "దిక్కూ మొక్కూలేని వాడిలాగ తిరుగుతావా?

నీకంత ఖర్మమేం పట్టింది?" అన్నది ఇంకా చాలా అన్నది కాని నామీద ఆమెకేమీ కోపంలేదు మళ్ళీ కొత్తచొక్కా, కొత్తలాగు తొడిగింది ఇక రోజల్లా చెమటలు కార్చడం తప్ప మరేంలేదు. అక్కణ్ణించి మామూలు కార్యక్రమం మొదలు. అమ్మగారు గంట కొట్టేది గంట ఆగిపోయేలోగా చచ్చినట్టు ఆకలయినా కాకపోయినా భోజనానికి రావలసిందే భోజనంముందు కూర్చుని వెంటనే తినకూడదు. "అమ్మగారి ప్రార్థనలు పూర్తికావాలి, తరవాత కొంతసేపు, "ఆపదార్థం బాగులేదు, ఈపదార్థం బాగులేదు," అని వంటవాడిని ఆవిడ సాధించాలి ఆతరవాతనే భోజనం.

భోజనం కాగానే ఆవిడ బైబిల్ పుస్తకం బయటికి తీస్తుంది మోజెస్‌ను గురించి చదివి వినిపిస్తుంది. మోజెస్ కథ విన్నప్పుడు ఆయనొక్కసారి చూడాలనిపించింది కాని మోజెస్‌చచ్చిపోయి చాలారోజులైందని ఆవిడ చెప్పినది దాంతో మోజెస్ మీద నాకు మోజు తగ్గిపోయింది ఎందుకంటే చచ్చిపోయిన వాళ్లతో ఏ రకమైన సంబంధంగాని పెట్టుకోవటం నాకు ఇష్టంలేదు.

చుట్టలు కాల్చాలనిపించింది అమ్మగారినడిగాను ఆవిడ కోప్పడ్డది చుట్టలు కాల్చటం నీచమన్నది; ముశికితన మన్నది, ఇంకెప్పుడు కాల్చనని ఒట్టేసుకోమన్నది. ఇదే, కొందరు మనుషులతో వచ్చినచిక్కు. తమకేమీ తెలియని విషయాలను గూర్చి కొన్ని మూఢనమ్మకాలు పెంచుకుంటారు. మచ్చుకి ఆమోజెస్‌ని తీసుకోండి అతడు ఆమెకి చుట్టంకాదు సరిగదా అతణ్ణి ఎప్పుడు చూసైనా ఎరగదు. పైగా ఎన్నివందల ఏళ్లకిందనో కీర్తి శేషుడయ్యాడు. అయినా అతనంటే ఆవిడ కెందుకో అంత అపేక్ష. అల్లాగే నాచుట్టల విషయంకూడా. చుట్టల్ని గురించి ఆమె ఏ మెరుగునని వాటిని నిందిస్తుంది? నిజానికి చుట్టల్లో కొంతచెడు, కొంత మంచిలేకలేదు. పైగా ఆవిడ ముక్కుపొడుం పీల్చటంలా ? ముక్కుపొడుం పీల్చేది ఆవిడైనంత మాత్రాన అది మంచిదై పోతుందా?

అమ్మగారికి మిస్ వాట్సన్ అని ఒక చెల్లెలున్నది ఆవిడ వయస్సుకి చాలా పెద్దదైనా పెళ్లి కాలేదు. ఆమె ఈమధ్య కొంత కాలంనుండి అక్కగారి వద్దనే ఉంటున్నది ఆవిడొకతె నాప్రాణానికి. నాకు రాత నేర్పుతానని చెప్పి స్పెల్లింగ్ పుస్తకం ఒకటి తీసింది ఒక గంటసేపు నన్ను యమయాతన పెట్టింది ఉదాహరణకి: "కాళ్లు బారజాపకు హాకల్ బెరీ!" "అల్లా వాలిపోతావేం హాకల్ బెరీ?" "అస్తమా

## ఈనవలనుగూర్చి

"హాకల్ బెరీఫిన్" "టామ్‌సాయర్"కు రెండో భాగమని చెప్పవచ్చు అందుచేత "టామ్‌సాయర్‌ను" ముందు చదివి వుంటే ఈనవల బాగా అర్థమవుతుంది (టామ్‌సాయర్ పుస్తకం మా కార్యాలయానికి వ్రాసి తెప్పించుకో వచ్చును వెల 2 రూ ) అయినా ఆనవలలో కథా వస్తువుకీ ఈనవలలో కథావస్తువుకీ సంబంధంలేదు "టామ్‌సాయర్"లో కేవలం చిన్నపిల్లల స్వభావాలను, అల్లరి పనులను, ఆలోచనలను మాత్రమే మార్క్ ట్వేన్ వర్ణించాడు "హాకల్ బెరీఫిన్"లో ఇతివృత్తం ఇంకా విశాలమైనది అమెరికా దేశాన్నంతటినీ మన కళ్లకు కట్టినట్టు చూపిస్తాడు రచయిత కొంత దూరందాకా "టామ్‌సాయర్" కథతో ముడిపెట్టుకుని నడిచినా, పోనుపోను ఈనవల అంతర్యుద్ధానికి పూర్వంగల అమెరికన్ సమాజాన్ని, ఆసమాజ సమస్యలను చిత్రించడానికి పూను కుంటుంది మార్క్ ట్వేన్ తీవ్రమైన ప్రజాస్వామిక వాది వ్యక్తిస్వాతంత్ర్యంలో అమితమైన నమ్మకం గలవాడు ఈనవలలో అమెరికన్ నిగ్రో సమస్యను తీసుకుని పీడిత మానవులమీద తనకుగల సానుభూతిని ప్రదర్శించాడు అమెరికాలో అంతర్యుద్ధానికి పూర్వం నీగ్రోలు బానిసలుగా వుండేవారు బానిసలను యజమానులు మనుషులుగా పరిగణించేవారు కాదు పశువులను, వస్తువులను కొనుక్కున్నట్టు కొనుక్కోవటం, అమ్మటం జరిగేది ఈబానిసతనం రూపు మాపడానికే అమెరికాలో రెండు పక్షాలవారి మధ్య అంతర్యుద్ధం జరిగింది యుద్ధం ఫలితంగా నీగ్రోలు స్వతంత్ర పౌరులయ్యారు అయినా వారి పరిస్థితి ఈనాటికీ మార్క్ ట్వేన్ కాలంలోవలెనే వున్నది అల్ప సంఖ్యాకులైన నీగ్రోలను తెల్లవారు అన్నివిధాలా హింసిస్తూనే వున్నారు

ఈసమస్యను మార్క్ ట్వేన్ సర్వమానవ సమస్యగా చిత్రించాడు ఈనవలలో జిమ్ అనే నీగ్రో బానిస తనపు చెరసాలనుండి తప్పించుకోవడానికి చేసే ప్రయత్నాలే ఈనవలలో ముఖ్య కథా వస్తువని చెప్పవచ్చు "హాకల్ బెరీఫిన్‌కు" కథా నాయకుడు జిమ్ అని మార్క్ ట్వేన్ ఒకసారి అన్నాడు ఈవిషయం ఎలావున్నా ఈనవల అత్యంతాహ్లాదకరమైన దనటానికి సందేహంలేదు ఈ కొత్త సీరియల్‌ను మా పాఠకులు తుదివరకూ చదివి ఆనందిస్తారని ఆశిస్తున్నాము

నం ఆవులించకు హక్! మంచిదికాదు," ఇదీ ఆవిడ ధోరణి. ఒకసారి ఆమె నరకాన్ని వర్ణించింది. ఆవర్ణన విన్నాక "అక్కడికి పోవాలనుంది," అన్నాను. అల్లా అనుకోవటంలో తప్పేముంది చెప్పండి. కాని ఆవిడ ఎంత భయపడిందో చెప్పలేను. నా ఉద్దేశ్యం మరేం లేదు. ఎక్కడికో అక్కడికి పోవాలిగదా. ఆపోయేది కాస్త మంచిచోటుగా చూసుకుని పోవటం మంచిది గదా. అందుచేత నరకానికే పోదామనుకున్నాను. ఇంతలోకే ఆమె నామీద కోప్పడ నవసరంలేదు. "నేనన్నమాట ఘోరపాపం," అన్నది తనామాట చస్తే నోటివెంట రానివ్వ లేనన్నది తను స్వర్గానికి తప్ప మరెక్కడికీ పోననీ, స్వర్గానికి పోయేందుకు వీలుగా మంచి జీవితం గడుపుతున్నాననీ అన్నది. కొంతసేపు స్వర్గాన్ని వర్ణించింది కూడాను. కాని ఆవర్ణనవింటే చప్పిడికూర తిన్నట్టేవుంది బుద్ధిగల వాడెవ్వడూ స్వర్గం పోలేడనుకున్నాను. అందులో నాలాటివాడు స్వర్గంలాటి ఉసూరుమనే చోట ఎప్పటికీ గడపలేడు కాని ఆమాట మిస్ వాట్సన్‌తో చెప్పలేదు ఎందుకంటే ఆవిడ కావిషయం ఎంత చెప్పినా అర్థంకాదు పైగా పుట్టెడు కోపం ముంచుకొస్తుంది.

నేనేమీ మాట్లాడక పోవటంచూసి మిస్ వాట్సన్ ఉషారుగా స్వర్గవర్ణన సాగించింది. అక్కడ చేద్దామన్నాపని వుండదుట పొద్దస్తమానం ఊరికే తిరగటమేనట చేతులో ఫిడేలు పుచ్చుకుని పాటలు పాడటంతప్ప మరోపని లేదుట అసలు విశేష మేమంటే ఎన్ని యుగాలైనా అంతేనట దానికి ఆఖరంటూ వుండదుట ఈమాట వినేసరికి నాకు కొంతభయం కూడా కలిగింది. టామ్‌సాయర్ స్వర్గానికి వెడతాడా అని అడిగాను టామ్‌సాయర్ అల్లరి పిల్లవాడనీ, అతడెప్పటికీ స్వర్గానికి వెళ్లలేడనీ ఆమె చెప్పింది. నాకు కాస్త ధైర్యం కలిగింది ఎందుకంటే నేనూ, టామ్ ఒకచోటికే పోతే బావుండుననిపించింది

పడుకోబోయే ముందు మళ్ళీ ప్రార్థనలు జరిగాయి. తరవాత నేను నాగదికి వెళ్లిపోయాను. కొవ్వొత్తి వెలిగించి బల్లమీద పెట్టాను కిటికీ పక్కన కుర్చీలో కూర్చుని ఏదన్నా సంతోషకరమైన సంగతిని ఆలోచిద్దామనుకున్నాను. కాని లాభంలేక పోయింది ఈఒంటరి దిగులుజీవితం కంటే చచ్చిపోతే బతికిపోదు ననిపించింది. ఆకాశంలో నక్షత్రాలు కూడా ఏమీ తోచనట్టు ప్రకాశిస్తున్నాయి. చెట్లఆకులు గిలగిల కొట్టుకుంటూ రోదచేశాయి దూరంగా గుడ్లగూబ చచ్చిపోయిన వాళ్లతో మాట్లాడుతోంది. చావబోయే వాళ్లని గురించి కాబోలు ఒకకుక్క ఏడుస్తోంది ఏదో రహస్యం చెప్పబోయినట్టు గాలి నా చెవివద్ద వీచింది. నాకు వళ్లు ఝల్లుమంది. అడవుల్లో ఏదో శబ్దం వినిపించింది. దెయ్యం మాట్లాడుతున్నదనుకున్నాను. పాపం, దెయ్యాలకి ఏదో చెబుదామని వుంటుంది. కాని వాటిభాష ఎవరికీ అర్థంకాదు. అందుచేత అవి ప్రతిరాత్రీ సమాధుల్లోంచి లేచి ఏడుస్తూ తిరుగుతాయి నాకు చెప్పలేని భీతిపుట్టింది పక్కనెవరన్నా వుంటే బావుండు ననుకున్నాను ఇంతలో ఒక సాలిపురుగు నా బుజంమీద పాకింది నేను దులుపుకున్నాను అదిపోయి కొవ్వొత్తి మీదపడింది. తీద్దామనుకుంటుండగానే అది కాలి నేలమీద పడిపోయింది. అది చెడ్డ శకునమని, ఏదోకీడు రాబోతున్నదని ఎవరూ చెప్పకుండానే నాకర్థమైంది లేచాను మూడుసార్లు ఇటునుంచి అటూ, అటునుంచి ఇటూ తిరిగి మూడు సార్లు రొమ్ముమీద 'శిలువ' గీతగీశాను తలమీద ఒక వెంట్రుక పీకి దాన్ని ఒకదారానికి కట్టాను అల్లా చేస్తే దెయ్యాలు మనదగ్గిరికి రావు అయినా నాకు భయం తగ్గలేదు.

మళ్లీ కూర్చున్నాను, గజగజ వణుకుతూ. చుట్టతీసి ముట్టించాను ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. అంచేత నేను చుట్ట కాలుస్తున్నట్టు ఎవరికీ తెలిసే అవకాశంలేదు ఇంతలో ఊళ్లోని గోపుర గడియారం టంగ్ టంగ్‌మని గంటలు కొట్టసాగింది. పన్నెండు గంటలు లెక్కపెట్టాను మళ్లీ నిశ్శబ్దం. ఇదివరకు కంటే అగాధమైన నిశ్శబ్దం

ఇంతలో చీకట్లో ఎక్కడో ఎండుకొమ్మ విరిగిన అలికిడి అయింది. ఉలికిపడి లేచి నుంచున్నాను. చెవి ఒగ్గివిన్నాను. కొంతసేపటికి కిటికీ దగ్గిరగా "మ్యావ్! మ్యావ్" మని వినిపించింది ఆ, బలే మళ్లీ నేనుకూడా సమాధాన మిచ్చాను—మ్యావ్! మ్యావ్! కొవ్వొత్తి ఊదేశాను కిటికీలోంచి బయటికి దూకాను. నేలమీద పాకుకుంటూ చెట్లమధ్యకు వెళ్లాను. నేనను

కున్నట్టే అక్కడ టామ్‌సాయర్ ఉన్నాడు పంట్లాం జేబుల్లో చేతులు పెట్టుకునుంచుని.

## 2

అమ్మగారి యింటి ఆవరణనుండి తప్పించుకు పోయేందుకని నేనూ, టామ్ దొడ్డిదోవ పట్టాము. సద్దుకాకుండా మునివేళ్లమీద నడుస్తూ, చెట్లకొమ్మలు తలలకు తగలకుండా వంగి వంగి పోయాము. వంటింటి దగ్గిరలో నేను ఒక ఎండు పుల్లమీద కాలువేశాను. చప్పుడైంది. వెంటనే నేలకు అంటి పెట్టుకుని పడు కున్నాము ఎందుకంటే వంటింట్లో కొవ్వొత్తి వెలుగుతున్నది. గుమ్మంలో మిస్‌వాట్సన్ నీగ్రో నౌకరు జిమ్ కూర్చుని గోళ్లు కొరుక్కుంటున్నాడు. నేను చేసిన చప్పుడు వినగానే లేచి నుంచున్నాడు. మెడ పొడిగించి చీకట్లోకి చూశాడు. మళ్లీ చప్పుడౌతుం దేమోనని విన్నాడు.

"ఎవరక్కడ?" అన్నాడు. మళ్లీ కాసేపు చెవులు ఓరగాపెట్టి విన్నాడు తరవాత తనుకూడా మునివేళ్లమీద నడుస్తూ సరిగ్గా నాకూ, టామ్‌కీ మధ్య నుంచున్నాడు. వేలు కదిలించినా తగిలేటంత దగ్గరసా నుంచున్నాడు కొన్ని నిమిషాలు గడిచాయి. ఊపిరి తీసినా వినిపిస్తుందేమో నన్నట్లు గుప్‌చుప్‌గా కూర్చున్నాము. నాకు సీలమండ మీద దురదపుట్టింది కాని గోక లేదు. తరవాత చెవిమీద దురద పుట్టింది తరవాత వీపుమీద, మెడమీద దురద పుట్టింది. గోక్కోకపోతే చచ్చిపోతా ననిపించింది. అప్పుడప్పుడు ఇలాగే జరుగుతుంది. పెద్దమనుషు లున్నప్పుడు, చర్చిలో ప్రార్థనలు చేసేటప్పుడు, నిద్రపట్టక నిద్రపట్టించుకుందామని కదలకుండా పడుకున్నప్పుడు, ఎప్పుడెప్పుడు గోక్కోటం మంచిదికాదో సరిగ్గా అప్పుడే దురద పెడు తుంది

ఇంతలో జిమ్ అన్నాడు:

"ఏయ్, ఎవరక్కడ? మాట్లాడరేం? ఇందాక ఆచప్పుడు నేను వినలేదను కున్నారా? మీరు గనక మాట్లాడకపోతే ఏం చేస్తానో తెలుసా? ఇక్కణ్ణించి కదలను మళ్లీ మీ చప్పుడు వినిపించేవరకూ ఇక్కడే కూచ్చుంటాను"

జిమ్ అక్కడే కూర్చున్నాడు నాకూ టామ్‌కు మధ్య ఒక చెట్టు నానుకుని కాళ్లు బారజాపాడు. అతనికాళ్లు నాకాళ్లను దాదాపు తగిలేంత దగ్గిరిగా వున్నాయి ఇంతలో నాకు ముక్కు దురదపెట్టింది. దురద దుర్భరమై కళ్లంబడి నీళ్లు గిర్రున తిరిగాయి. అయినా గోకలేదు. ఈసారి బుజంమీద, చూపుడు వేలుపక్కన ప్రారంభమైంది దురద అయిదారు నిమిషాలు యమయాతన పడ్డాను ఆ కాస్సేపూ అయిదారు వేళ్లయి నట్లని పించింది ఆలోగా పదకొండు వేరువేరు స్థలాల్లో ఒక్కసారే దురద మండిపోయింది పళ్లుబిగించి ఓర్చు కుంటున్నాను. ఇంకో నిమిషమైతే

ఏం చేసేవాణ్ణో తెలియదు. ఇంతలో జిమ్‌గాడి గుర్రు వినిపించింది. అమ్మయ్య అనుకుని కరువుదీర వళ్లంతా గోక్కున్నాను

టామ్ "ఇస్‌స్‌స్." అని సంజ్ఞ చేశాడు. ఇద్దరం పాక్కుంటూ పది అడుగుల దూరంపోయి లేచాము. నీగ్రోను తమాషాకి చెట్టుకు కట్టివేస్తా నన్నాడు టామ్. వద్దన్నాను, జిమ్ లేస్తే కేకలు వేస్తాడనీ, ఇంట్లో వాళ్లు మేలుకుని ఇవతలకొచ్చి మన్ని చూస్తారనీ అన్నాను తరవాత టామ్ తనదగ్గిర కొవ్వొత్తులు ఎక్కువలేవనీ, వంటింట్లోకిపోయి కాసిని తీసుకు వస్తాననీ అన్నాడు. ఈలోగా జిమ్ లేస్తే ప్రమాదమని వారించాను. కాని టామ్ వినలేదు అందుచేత ఇద్దరం లోపలికిపోయి మూడు కొవ్వొత్తులు సంపాదించాము. దొంగిలించామని ఎవరూ అనుకోకుండా టామ్ బల్ల మీద కొవ్వొత్తుల ఖరీదుకింద అయిదు సెంట్లుపెట్టాడు. మళ్ళీ బయటికి వచ్చాము. టామ్ ఎంత చెబుతున్నా వినకుండా జిమ్ గాణ్ణి తమాషా చెయ్యటాసకే నిశ్చయించు కున్నాడు.

నేను అమ్మగారి తోట కంచె దగ్గిర నుంచున్నాను టామ్ తిరిగివచ్చాక ఇద్దరం కంచె దూకాము. ఇంటికి అవతలి వేపునవున్న కొండమీదికి పోయేదారి పట్టాము. దోవలో టామ్ చెప్పాడు. జిమ్ టోపీ తీసేసి నెత్తికి సూటిగావున్న కొమ్మకి తగిలించాడట. జిమ్ కొంచెం కదిలాడటగాని లేవలేదుట. మర్నాడు జిమ్ చుట్టుపక్కల వాళ్ళతో కోతలు కొయ్యటం మొదలెట్టాడు తాను నిద్రపోతుండగా కామినీ భూతాలు వచ్చిలేపి రాష్ట్రమంతటా తిప్పాయని, మళ్లీ తీసుకొచ్చి చెట్లకింద పడుకో బెట్టాయని, టోపీలాగేసి చెట్టుకొమ్మకి తగిలించాయనీ చెప్పాడు ఆ తరవాత సారి ఈసంగతి చెప్పేటప్పుడు, తన్ను అమెరికా దేశమంతటా కామినీ భూతాలు తిప్పాయన్నాడు ఇలా కొన్నిరోజులయ్యేసరికి తను తిరిగినస్థలాన్ని క్రమంగా విస్తరిస్తూ తను భూలోకమంతా తిరిగానని చెప్పకోసాగాడు కామిని భూతాలు ప్రత్యేకంగా తనమీదే కన్ను వేసినందుకు వాడెంతో గర్వపడ్డాడు. చుట్టుపక్కల ఊళ్లనుండి కూడా నీగ్రోలు బోలెడు మంది వచ్చి వాడికథ విని పోయేవారు. అసలు నీగ్రోలకు కామినీ భూతాలమీద చెప్పలేనంత నమ్మకం. ఎప్పుడూ వాటినిగూర్చే మాట్లాడుతూ వుంటారు. అల్లా ఎవరన్నా నలుగురు నీగ్రోలుచేరి కామినీ భూతాలను గూర్చి చర్చిస్తుంటే, జిమ్ అక్కడికొచ్చి "అరేయ్, మీకేం తెలుసునురా, వాటిసంగతి. నాకు తెలిసిన దాంట్లో వందోవంతు తెలియదు," అని దబాయించేవాడు దాంతో మిగతావాళ్లు నోరు మూసుకునేవారు. టామ్ ఆరాత్రి బల్లమీద పెట్టిన అయిదు సెంట్ల నాణాన్ని జిమ్ మెళ్లో కట్టుకుని తిరిగేవాడు. అది భూతాలు తనకిచ్చాయనీ, దాంతో ఏరోగాలైనా చిటికెలో కుదర్చగలననీ, ఒక మంత్రం చదివితే భూతాలు ఎప్పుడుపడితే అప్పుడు తన దగ్గిర కొస్తాయనీ చెప్పేవాడు. వాడిదగ్గిర ఆనాణెం చూట్టానికని రోజూ జనం పోగయ్యేవారు. కాని ఎవరూ దాన్ని ముట్టుకొనేవారు కాదు ఎందుకంటే అది ముట్టుకుంటే మాడి భస్మమై పోతామని వాళ్లభయం.

కొండమీద నుంచుని నేనూ, టామ్ గ్రామం వేపు చూశాం. అంతా నిశ్శబ్దంగా, అంధకారంగా వుంది. ఆకాశంలో మాత్రం నక్షత్రాలు మెరుస్తున్నాయి. గ్రామం పక్కగా నది ప్రవహిస్తున్నది. కొండదిగి అవతలి వేపుకి వెళ్లాము జోహార్పర్, బెన్ రోజర్స్, ఇంకా ఇద్దరు ముగ్గురు స్నేహితులు అక్కడ మాకోసం కాచుకుని వున్నారు. పడవల రేవుకి వెళ్లాము. ఒకపడవను కట్టుకొయ్య నుండి విప్పేసి, ఎక్కి బయల్దేరాము. నది దిగువకు రెండున్నర మైళ్లు తోసుకుపోయాము ఒక కొండవద్ద ఆగాము. పడవ దిగి అందరం ఒడ్డుకి పోయాము.

అక్కడన్నీ దట్టంగా అల్లుకున్న పొదలున్నాయి. టామ్ మా అందరిచేతా ప్రమాణం చేయించాడు మా రహస్యం ఎవ్వరికీ చెప్పమని. తరవాత ఒక పెద్ద పొదను ఒత్తిగించి ఒక బిలం చూపించాడు కొవ్వొత్తులు వెలిగించి బిలంగుండా దేకుతూ లోపలికి పోయాము దాదాపు రెండువందల గజాల దాకా అలాగే పాకుతూ పోయాము అక్కడ గుహా ద్వారం కనిపించింది లేచి నుంచుని ఇరుకు గోడల మధ్యగా నడిచి ఒకగది లాంటి స్థలం చేరుకున్నాము. అక్కడ నేల, గోడలు తేమగా వున్నాయి. బాగా చల్లగావున్నది. టామ్ ఇలా అన్నాడు

"ఇప్పుడు దొంగలముఠా ప్రారంభిద్దాం. దానికి

"టామ్‌సాయర్ ముఠా" అని పేరు పెడదాం. ఈ ముఠాలో చేరదలుచుకున్న వాళ్లు ముందు ప్రమాణం చెయ్యాలి. ఆ ప్రమాణం కింద నెత్తురుతో సంతకం చెయ్యాలి."

దీని కందరం అంగీకరించాము. టామ్ జేబులోంచి ఒక కాగితం తీశాడు దానిమీద ప్రమాణం రాయబడివున్నది. దాంట్లో ఏమని వుందంటే— ముఠాను ఎప్పటికి విడిచిపెట్టము. ముఠా రహస్యాలు ఎవరికీ చెప్పము. ఎవరైనా ముఠా సభ్యులలో ఒకడికి హానికలిగిస్తే ఆమనిషిని, ఆమనిషి కుటుంబాన్ని హత్యచెయ్యాలి. ముఠా సభ్యుల్లో ఎవడైనా సరే హత్య చెయ్యటానికి సిద్ధంగా వుండాలి. హత్య చేసిందాకా నిద్ర పోగూడదు, అన్నం ముట్టుకోగూడదు. ముఠాయొక్క గుర్తు శిలువ(†). ఈగుర్తును ముఠాతో సంబంధంలేని వాళ్లెవ్వరైనా ఉపయోగిస్తేవాణ్ణి విచారణ చెయ్యాలి. మళ్లీ ఉపయోగిస్తే హత్య చెయ్యాలి ముఠాలో వాడెవడైనా రహస్యాలు బయటపెడితే వాణ్ని మెడకాయ కోసి, మిగతా దేహాన్ని తగలబెట్టి బూడిదను విరజిమ్మాలి ఆద్రోహి పేరును ముఠా జాబితాలోంచి రక్తంతో తుడిచి వెయ్యాలి వాడిపేరు తరవాత ఎవరూ ఉచ్చరించ గూడదు. వాణ్ని శాశ్వతంగా మరిచిపోవాలి

ఈ ప్రమాణం అత్యద్భుతంగా వుందనీ అంతా అన్నారు. "ఇదంతా నువ్వు కల్పించిందేనా?" అని టామ్ నడిగారు. కొంత తను కల్పించాననీ, కొంత దొంగల్ని గూర్చిన నవలల్లోంచి పీక్కాననీ చెప్పాడు.

రహస్యాలు బయటపెట్టిన సభ్యుణ్ణే కాకుండా, వాడి కుటుంబాన్ని కూడా నాశనం చెయ్యాలని కొందరు సూచించారు. టామ్ ఒప్పుకున్నాడు. పెన్సిలు తీసుకుని ప్రమాణ పత్రంలో ఆముక్క కూడా రాశాడు. కాని బెన్‌రోజర్స్‌కో అనుమానం వచ్చింది.

"హాకల్ బెరీఫిన్‌కి కుటుంబం లేదుగదా? మరి వాణ్ణేం చేద్దాం?"

"వాళ్ల నాన్న వున్నాడుగా?" అన్నాడు టామ్ సాయర్.

"అవును వాళ్లనాన్న వున్నాడుగాని అతన్ని పట్టుకోవటం కష్టం. ఏడాది నుంచీ ఈ ప్రాంతాల్లో కనిపించటం లేదు. ఎప్పుడు వస్తాడో, ఎప్పుడు పోతాడో ఎవరికీ తెలియదు," అన్నాడు బెన్ రోజర్స్.

కాస్సేపు ఈవిషయం మీద తర్జన భర్జనలు జరిగాయి. చివరికి నన్ను ముఠాలోంచి తీసేద్దామనుకున్నారు. ముఠా సభ్యులకి విధిగా ఒక కుటుంబం అంటూ వుండాలనీ, లేకపోతే చంపటానికెవరూ వుండరనీ, ఒకళ్లకి చంపటానికి కుటుంబం వుండి, మరొకడికి లేకపోతే మిగతా వాళ్లకి అన్యాయం చేసినట్లవుతుందనీ, అన్నారు. ఏం చెయ్యటానికీ ఏం తోచలేదు ఆపరిస్థితిలో - నాకు ఏడుపు కూడా వచ్చింది, కుటుంబం లేకపోవటం మూలానగదా నాకు

ముఠాలో స్థానం లేకపోయిందని. ఇంతలో చక్కని ఉపాయం తట్టింది అంతగా చంపవలసివస్తే నా తరఫున మిస్ వాట్సన్ని చంపచ్చునని చెప్పాను. అందరూ బావుంది బావుందని చప్పట్లు కొట్టారు.

"అయితే హక్ మన ముఠాలో తప్పకుండా చేరచ్చు."

తరవాత సూదులతో వేళ్లమీద పొడుచుకుని, నెత్తురు తెప్పించుకుని కాగితంమీద సంతకాలు చేశాము.

"మనముఠా ఏమేం చేస్తుంది," అన్నాడు బెన్ రోజర్స్.

"ఏమీలేదు, దోచుకోవడం, ఖూనీలు చెయ్యడం," అన్నాడు టామ్

"గొడ్లుగోద దొంగిలిద్దామా?"

"ఛా గొడ్ల దొంగతనం ఎవరు పడితే వాళ్లే చెయ్యగలరు. మనం అసలైన బందిపోటు దొంగతనాలు చెయ్యాలి," అన్నాడు టామ్. "మొహానికి నల్లటి ముసుగులు కప్పుకోవాలి రోడ్లమీద ప్రయాణీకులను, బళ్ళను ఆపి వాళ్లని చంపి గడియారాలు, డబ్బు ఎత్తుకు పోవాలి."

"ప్రతిసారీ మనుషుల్ని చంపాలా?"

"చంపితీరాలి అది మంచిది కొందరు సూత్రకారులు ప్రతిసారీ చంపక్కర్లేదన్నారు గాని చంపటమే మంచిది. అయితే కొందర్ని కట్టి తీసుకొచ్చి ఈగుహలో ఖైదుచెయ్యచ్చు పరిహార మిచ్చేదాకా"

"పరిహారం అంటే ఏమిటి?"

"నాకూ తెలియదు కాని దొంగలు ఎప్పుడూ పరిహారం పుచ్చుకుంటూ వుంటారు నేను పుస్తకాల్లో చదివాను కూడా అల్లా పుచ్చుకుంటారని అంచేత మనంకూడా పరిహారం పుచ్చుకోవలిసిందే," అన్నాడు టామ్.

"ఏడిసి నట్టుంది అదేమిటో తెలియకుండా ఎల్లా పుచ్చుకుంటాం?

"నువ్వూరుకో నీకు తెలియదు పుచ్చుకుని తీరాల్సిందే పుస్తకాల్లో రాసిందానికి వ్యతిరేకంగా చేయటానికి మన కధికారం లేదు అల్లాచేస్తే పాడైపోతాం"

"నువ్వు చెప్పింది కాదనటం లేదు టామ్! వాళ్లదగ్గిర్నించి పరిహారం ఎల్లా పుచ్చుకుంటావ్ అదేమిటో తెలియకుండా? అసలది ఏమై వుంటుంది?"

"నాకూ తెలియటంలా. బహుశా వాళ్ళని చచ్చిపోయే దాకా ఖైదీలుగా వుంచితే పరిహారం ఇచ్చి నట్టవుతుందేమో"

"అల్లా అన్నావు బావుంది. ఆమాట ఇందాకే చెబితే వొప్పుకునే వాణ్ణిగా ఏం చెయ్యాలంటే వాళ్లు చచ్చేదాకా పరిహారం పుచ్చుకుంటూవుండాలి ఐతే వాళ్లు చచ్చేదాకా మనమే మేపాల్సి వస్తుంది. వాళ్లు పారిపోకుండా కాపలా కాస్తూండాలి"

"అబ్బ నువ్వెప్పుడూ కుళ్ళంకలు వేస్తూ వుంటావురా బెన్! గట్టి కాపలా పెట్టకుండా వూరుకుంటామేమిటి? వాళ్లేమాత్రంకదిలినా షూట్ చేసెయ్యటమే."

"కాపలా కాయటం కష్టం ఖైదీలతోపాటు కాపలా వుండేవాళ్లు కూడా రాత్రిం బగళ్లు మేలు కూర్చోవాలి అసలు ఖైదీల్నిక్కడికి తీసుకురాగానే దుడ్డుకర్ర పుచ్చుకుని నెత్తిమీద పరిహారం పుచ్చుకుంటే?"

"ఎందుకంటే అల్లా చెయ్యచ్చని పుస్తకాల్లో లేదు—అందుకని ఇదిగో బెన్రోజర్స్! నువ్వు నీయిష్టం వచ్చినట్టు చేస్తావా లేక సూత్రకారులు చెప్పినట్టు చేస్తావా? పుస్తకాలు రాసిన వాళ్లకి నీపాటి తెలివితేటలు లేవనుకుంటున్నావా? అల్లా ఎప్పుడూ అనుకోకు మనం శాస్త్రోక్తంగా పరిహారం పుచ్చుకోవలిసిందే"

"సరే నీయిష్టం కాని అది వట్టి తెలివితక్కువతనమని నా నమ్మకం మరి ఆడ స్త్రీలని కూడా చంపెయ్యాల్సిందేనా?"

"నువ్వొట్టి మొద్దువురా, బెన్! ఆడస్త్రీలని చంపటమా? ఏ పుస్తకంలోను ఆడస్త్రీలని చంపినట్టు నాకు తెలియదు వాళ్ళని గుహకి తీసుకురావటం మటుకు తీసుకొస్తాము వాళ్ళతో ఎంతోమర్యాదగా, మంచిగా వుంటాం క్రమక్రమంగా వాళ్లు మన్ని ప్రేమిస్తారు. ఇహ తరవాత ఇక్కణ్ణించి పొమ్మన్నా పోరు"

"బాగానే వుందిగాని నాకిదేం నచ్చలేదు. కొంత కాలమయ్యేటప్పటికి మన గుహానిండా బిలబిలమంటూ ఆడస్త్రీలు, పరిహార మియ్యాల్సిన మొగ

ఖైదీలు కిక్కిరిసిపోయి దొంగ లుండటానికి చోటుండదు. కానీ, నీయిష్టం, నువ్వేం చెబితే అదే రైట్ "

మా చర్చలేమీ వినకుండా టామీ బార్నెస్ నిద్రపోయాడు మా అందరిలోకీ వాడే చిన్నవాడు వాణ్ణి లేపే టప్పటికి వాడికి భయం వేసింది ఎక్కడున్నదీ తెలియక కాసేపు బిత్తరపోయాడు అమ్మ దగ్గిరికి పోతానని ఏడ్చాడు. ఇకనుంచీ బందిపోటు దొంగగా వుండనన్నాడు

అంతా వాణ్ణి "పాల పాపాయి" అని ఏడిపించారు దాంతో వాడికింకా గాబరాపుట్టి తను వెళ్లి మారహస్యా లందరికీ చెప్పేస్తా నన్నాడు కాని టామ్ వాడికి అయిదు సెంట్లు లంచం ఇచ్చాడు నోరు మూసుకోమని

తరవాత టామ్ సభముగించాడు వచ్చేవారం ఇక్కడే సమావేశమై, కొందర్ని దోచుకుని ఖూనీ చెయ్యాలని చెప్పాడు.

బెన్‌రోజర్స్ తను ఎప్పుడు పడితే అప్పుడు రాత్రిళ్లు ఇంట్లోంచి రావడానికి వీలుండదనీ, ఆదివారాలైతే తప్పకుండా రాగలననీ అన్నాడు కాని పవిత్రమైన ఆదివారం రోజున పాపకార్యాలు చెయ్య కూడదని ఒక రన్నారు అందుచేత ఆదివారాలు లాభంలేదన్నాడు టామ్ ఏరోజు నుంచీ మొదలు పెట్టాలో తరవాత నిర్ణయించేందుకు అందరూ ఒప్పుకున్నారు. టామ్ సాయర్‌ను మా ముఠాకు నాయకుడు గాను, జోహార్పర్‌ను ఉపనాయకుడు గాను ఎన్నుకున్నాం. తరవాత ఇళ్ళకు వెళ్ళిపోయాం.

నేను కిటికీ గుండా నా గదిలోకిదూరి కొవ్వొత్తి వెలిగించి చూసుకుంటే వళ్లు, తలా, బట్టలు అంతా బాడిబాడిగా వున్నాయి కాని సొమ్మసిలి వున్నానేమో ఒళ్లెరక్కుండా నిద్రపోయాను

(ఇంకావుంది)

# గురువుగారికి పంగనామాలు పెట్టబోతే

**శ్రీ సి. విశ్వనాథం**

ఆంగ్లభాష యీదరాని మహా సముద్రం వంటిది. దీనిని నేర్చుకోవాలంటే 14 సంవత్సరాలయినా శ్రమపడిచదవాలి. ఇంత కష్టపడి చదువుతే ఏదో సామాన్యంగా మాట్లాడేందుకు పనికి వస్తుందిగాని ఆ భాషలోని గుట్టు మట్టులు తెలుసుకొని సంపూర్ణ ప్రజ్ఞతో మాట్లాడటానికి పనికి రాదు. అయినా సంపూర్ణవిద్యనేర్చుకొని గుట్టులు మట్టులు తెలుసుకోవాలంటే మన ఆయుర్దాయం సరిపోతుందా అని నావూహ. ఆంగ్లభాషలోని గుట్టు మట్టులు తెలుసుకొని అనేక చమత్కారములతో ఆంగ్లభాషకే కాకుండా ఆంధ్ర దేశానికికూడా గొప్పఖ్యాతి గడించి పెట్టిన ఒక మహామహుని గురించి యిక్కడ ఒక కథ చెబుతాను.

శ్రీ॥ శ్రీ॥ రఘుపతి వెంకట రత్నం నాయుడుగారు గొప్ప ఆంగ్ల విద్యావేత్తలు. ఆయన ఒకప్పుడు కాకినాడ పి. ఆర్. కాలేజికి పిన్సిపాలుగా వుండేవారు ఆయన తన ఆంగ్ల పాండిత్యం తన వద్దే దాచుకోకుండా తన శిష్యులకు కూడా అంతో యింతో పంచిపెట్టారు. అందువల్ల ఆయన ఆంగ్ల విద్యా ప్రావీణ్యం ఆయన శిష్యులలో కూడా గోచరించేది. ఇక్కడ ఒక సంగతి చెప్పాలి. అదేమిటంటే ఆయనకు ఆడపిల్లలు అంటే అపారమైన ప్రేమ ఆసంగతి ఆయన శిష్యులందరికీ తెలుసును. అయినా గురువుగారి మీద ఎక్కడలేని గౌరవభావం చూపించడమే కాకుండా పితృతుల్యులుగా చూచుకొంటూ వుండేవారు కాని గురువుగారి దయవల్ల వచ్చిన అపారమైన ఆంగ్ల విద్యా వైశద్యాన్ని వాళ్లు అప్పుడప్పుడూ ఛలోక్తిగా వాడుతూ వుండేవారు.

ఒకనాడు ఆయన అందరు విద్యార్థుల్ని చూడాలని పించి *"The Principal will meet his classes to day"* అని నోటీసుబోర్డుపై రాయించారు. అనగా "పిన్సిపాల్ ఈనాడు తన క్లాసుల్ని కలుసుకొంటారు" అని అర్థం అదిచూచి ఆయన శిష్యుల్లో కొందరు తమాషా చెయ్యాలని అనుకొన్నారు ఆయన ఆడపిల్లల యందు చూపించే ప్రత్యేకమైన ఆదరణను అందుకు వూతగా తీసు కొన్నారు. వెంటనే నోటీసులో *"Classes"* అన్నమాటలోని మొదటి అక్షరమైన "C" ని చెరిపి వేశారు. అప్పుడా నోటీసు *The Principal will meet his lasses today"* అని మార్పు చెందింది. అనగా "పిన్ని

పాల్ ఈనాడు తన అమ్మాయిల్ని కలును కొంటారు" అని అర్థం.

మధ్యాహ్నం ఏదో పని వుండి అటు నుంచి వెడుతూ ఆ అఘాయిత్యాన్ని చూసేరు నాయుడు గారు. వెంటనే "*lasses*" అని వున్న మాటలోని మొదటి అక్షరమైన "*L*" ని ఆయన చెరిపి వేశారు. అప్పుడది *The Principal will meet his asses today*" అని మారి పోయింది. అనగా "ప్రిన్సిపాల్ ఈనాడు తన గాడిదలను కలుసు కొంటారు" అని అర్థం. చూచారా నాయుడుగారి ప్రజ్ఞ.

సాయంకాలం అల్లరి పిల్లలు తమ ప్రజ్ఞకు కడుపార సంతోషించాలని వుబలాటపడుతూ నోటీసు బోర్డు దగ్గరకు వెళ్లారు. కాని



దానిలో వాళ్లు గాడిదలుగా నిర్థరింప బడటం చూసి సిగ్గుపడి తమ పరువుకోసం వెంటనే "*asses*" అన్న మాట ఎదుట మళ్ళీ "*Cl*" అన్న రెండు అక్షరాలను చేర్చుకొన్నారు.

ఇంతకూ వారు వెక్కిరించబోయి బోల్తాపడ్డ సంగతి గ్రహించుకొని ఇక ముందెప్పుడూ గురువుగారికి పంగనామాలు పెట్ట ప్రయత్నించకూడదని లెంపలు వాయించుకొన్నారు. చూచారా బాలలూ తెలివి తేటలనేవి ఒకరి సొమ్ముకాదు అందరికీ వుండొచ్చు. కాని వాటిని వుపయోగించుకొని సన్మార్గంలో పెట్టితేనే గౌరవం. అంతేగాని తప్పుదారుల పట్టించి అతి తెలివి ప్రదర్శించబోతే అవమానం తప్పదు గదా? ★

# వాంగ్ గణితం

## “లక్ష్మీకాం”

చైనా దేశంలో ఒక ప్రఖ్యాత వర్తకు డుండేవాడు అతడు యిరుగుపొరుగువారి దగ్గర్నుంచి ధనం తీసికొని నిలవావుంచడం, వారు కోరినప్పుడల్లా ఎంత ధనంకావలిస్తే అంత యిస్తూండడం చేస్తూండేవాడు యిరుగు పొరుగు వారికిగూడా యీ ఏర్పాటు చాలా హాయిగా వుండేది. ఎందు కంటే వారికి ఎక్కువ ధనం దగ్గరున్నందువల్ల కలిగే యిబ్బందులు, దొంగ భయం మొదలైనవి, వుండేవి కావు. వారికి కావలిసినప్పుడు ఆవర్తకుడు ధనం యిస్తూండే వాడు వర్తకునికి గూడా ఈవ్యవహారం లాభ దాయకంగా వుండేది ఎవరికేనా యీ డబ్బు వడ్డీకి యిచ్చేవాడు ఈలెక్క పద్దులు చూచేదానికి వాంగ్ అనే యువకుడ్ని నియమించేడు అతడి పనేమిటంటే ఎవరేనా డబ్బు నిలవా వుంచడానికి యిచ్చినా తీసుకున్నా పద్దు వ్రాయటం. కాని వాంగ్ కి ఈలెక్క పద్దులంటే తెగని తలనొప్పి. అయితే ఈ వుద్యోగాని కెందుకు కుదిరాడు అని అడగవచ్చు ఆ వర్తకునికి టాసింగ్ అనే మంచి అందమైన కూతురు వుంది. వాంగ్ ఆమెని ప్రేమించేడు ఆమె కటాక్ష వీక్షణాలకు తహతహలాడే వాడు ఈ వుద్యోగం మూలాన్న అతడికి ఆమెతో కొంచెం సేపన్నా గడపటానికి అవకాశం లభించేది. కాని యీ వ్యవహార మంతా వర్తకునికి తెలియదు తెలిసివుంటే ఆతని వుద్యోగానికి ఆపత్తు కలిగిందన్న మాటే-టాసింగ్ ని చూడటానికి గ్గూడా స్వస్తే.

వాంగ్ తన వుద్యోగ ధర్మాలను నిర్వర్తించ టానికి ఒక మంచి వుపాయం కనిపెట్టేడు ఇరుగు పొరుగువారు ఎంతమంది వర్తకుని దగ్గర డబ్బు దాచు కుంటున్నారో అన్ని పెట్టెలు సంపాదించిఒక్కొక్కరికి ఒక్కొక్క పెట్టె కేటాయించాడు ఎవరేనా 5 రూపాయలు తమకు జమ కట్టమని యిచ్చినట్టయితే ఒక చిన్న అట్ట ముక్క మీద +5 అని వ్రాసి వారి పెట్టెలో వేసేవాడు అలాగే ఎవళ్లేనా 3 రూపాయలు తీసుకున్నట్టయితే ఒక అట్టముక్కమీద-3 అని వ్రాసి వారిపెట్టెలో వేసేవాడు తీరికైనప్పుడు ఆ అట్టముక్కలన్నిటినీ చూసుకుని లెఖ్ఖలు వ్రాసుకునే వాడు.

రోజు రోజుకు పెట్టెలన్నీ ఈ అట్టముక్కలతో నిండి పోతూండేవి. ఎప్పుడు వర్తకుడువచ్చి లెఖ్ఖలు తనిఖీ చేస్తాడా అన్న భయం అతడ్ని బాధిస్తూండేది. కాని వర్తకుడు తక్కిన వ్యవహారాల్లో పూర్తిగా నిమగ్నుడై యున్నందువల్ల యితని లెఖ్ఖల జోలికి రాలేదు. ఈ కారణంవల్ల వాంగ్ కి బద్ధకం మరీ ఎక్కువైంది అట్ట ముక్కలమీద (+5), (-3), అన్న అంకెలు వ్రాయటం గూడా కష్టమని పించింది కాబట్టి యింకా సులభమైన సూత్రాన్ని కని పెట్టేడు. కొన్ని అట్ట ముక్కల మీద (+2), (—4) (-2), (-3), అని వ్రాసి వుంచుకొనే వాడు - ఎవరేనా డబ్బిచ్చినా తీసుకున్నా దానికి సరిపోయిన అట్ట ముక్కని వాళ్ల పెట్టెల్లో వేసేవాడు.

ఈలా రోజులు గడుస్తూండగా

ఒకరోజు గట్టి చిక్కు వచ్చి పడింది. పిన్‌హో అన్న అతడు 5 రూపాయలను తన లెక్కలో జమ కట్టమని యిచ్చేడు $(+5)$ అన్న అట్టముక్కలన్నీ అయిపోయేయి- "ఏమిటి చేయడమా" అన్న సందిగ్ధావస్థలో పడ్డాడు వాంగ్- ఏ ఆలోచనా తట్టలేదు యింతలోకే అతని ప్రియురాలు టాసింగ్ ఆగదిలోకి రావడం తటస్థించింది "ఏం అలాగున్నావు" అని అడిగింది. వాంగ్ తన గొడవంతా చెప్పుకున్నాడు "ఓస్ యింతేనా" అంది టాసింగ్ వాంగ్ తెల్లమొగం వేశాడు అంత పెద్ద సమస్యని అంత నిరసనగా చూసింది కదా అని ఆమె $(+2)$ అన్న అట్ట ముక్కనీ $(+3)$ అన్న అట్టముక్కనీ చేర్చి "ఈ రెండూ పిన్‌హో పెట్టెలో వెయ్యి" అంది "ఏమిటీ నువ్వు చేసేది" అన్నాడు ఏదో పెద్దకొంప మునిగి పోయినట్టుగా టాసింగ్ నవ్వుతూ "అయ్యో నాపిచ్చి వాంగ్! యిటు చూడు" అని నేలమీద $+(+3) + (+2) = +(+5)$ వ్రాసి "చూసేవా" అంది "అదేమిటి $+(+3)$ అని వ్రాశేవు" అన్నాడు వాంగ్." ఈ $+$ గుర్తు $(+3)$ అన్న అట్టముక్కని పెట్టెలో చేర్చడానికి గుర్తు" అంది టాసింగ్ "అయితే $(+3)$ అన్న అట్ట ముక్కనీ $(+')$ అన్న అట్టముక్కనీ ఆ పెట్టెలోంచి తీసేస్తే $(+5)$ అన్న అట్ట ముక్కని తీసినట్టవుతుందా" అని అడిగాడు వాంగ్ "ఓ తప్పకుండా" అని నేల మీద $-(+3) - (+2) = -(+5)$ అని వ్రాసి చూపింది "ఈ $-$ గుర్తు $(+2)$ అన్న అట్ట ముక్కలోంచి తీసెయ్యడానికి చూపే గుర్తు" అంది టాసింగ్. వాంగ్‌కి అర్థమైంది తల వూపేడు

మళ్ళీ ఆ సాయంకాలమే వాంగ్ గొప్ప సందిగ్ధావస్థలో పడ్డాడు $(+1)$ అన్న అట్ట ముక్కలన్నీ అయిపోయేయ్-అప్పుడే వీభూ అనే ఆతడు "యిదిగో ఈ ఒక్క రూపాయి నా లెక్కలో వెయ్యి" అని యిచ్చాడు వాంగ్ ఏం చెస్తాడు వీభూని మనసారా తిట్టేడు వేళకాని వేళలో వచ్చినందుకు పోనీ 5 రూపాయలిచ్చినట్టయితే ప్రొద్దున్న నేర్చుకున్న సూత్రాన్ని అమలు జరిపేవాడు ఏం చేయ్యటం? బుర్ర గోకున్నాడు ఏమీపాలు పోలేదు అతని అదృష్టవశాత్తు టాసింగ్ అలా రావడం జరిగింది. మళ్ళీ వాంగ్ ముఖం వేలవేసి వుండడం చూసింది. "ఏమిటి విషయం" అని అడిగింది. తన అవస్థనంతా వివరించి చెప్పేడు వాంగ్, టాసింగ్ చాలా తీవ్ర ఆలోచనలో పడింది ఆమెకో వుపాయం తట్టింది దానికేం చాల సులభంగా చెయ్యెచ్చు" అంది. "వీభూ పెట్టెలోంచి $(-1)$ అన్న అట్టముక్క ఒకటి తీసెయ్ సరిపోతుంది" అంది "ఏమిటీ నువ్వచేది $(-1)$ అన్న అట్టముక్క తీసేస్తే సరిపోతుందా?" అని ఆశ్చర్య పడుతూ పొద్దున్న నేర్చుకున్న జ్ఞానాన్ని వుపయోగిస్తూ నేలమీద $-(1) = + (+1)$ అని వ్రాశేడు యింతలోకే వర్తకుడు పిన్‌హో లెఖ్ఖలు తనిఖీ చెయ్యటానికి ఆ గదిలోకి వచ్చేడు తన కూతురు బీదవాడైన వాంగ్‌తో చనువుగా వుండడం, చూసి సహించలేక పోయేడు పిన్‌హో పద్దులలో మూడు నెలల లెక్కలు వెయ్యబడక వుండటంచూసి వుగ్రుడై పోయేడు. భయపడుతూ ఒకమూల నక్కి వున్న వాంగ్‌ని చూసేడు- నేలమీద $-(-1) = +(+1)$ అన్న అంకెల్ని చూసేడు. "ఏమిటిదంతా" అని గద్దించేడు వర్తకుడు. భయపడుతూ, నీళ్లు నముల్తూ వాంగ్ తనగొడవ చెప్పుకున్నాడు. వర్తకుని కోపం ఒక్కసారి తగ్గిపోయింది తనకిలాంటి తెలివైన గుమాస్తా దొరికినందుకు ఆనందించాడు వాంగ్ తెలివితేటల్ని అభినందించాడు తనకూతురు టాసింగ్‌ని అతడికిచ్చి మహో, వైభవంగా వివాహం జరిపించాడు

చూశారా టాసింగ్ సమయోచిత బుద్ధివల్ల గణిత శాస్త్రంలో $+$ అన్న గుర్తులు పునాదులేర్పరుచుకున్నాయి ★

# ★ పక్షులు ★

## లకుముకి పిట్ట



లకుముకిపిట్ట సామాన్యంగా కాలువలు, చెరువులు, రోడ్ర ప్రక్కన మురికిగుంటలు మొదలైనచోట్ల కనిపిస్తుంది జనపదాల్లోనే ఎక్కువగా నివసిస్తుంది. సాధారణంగా ఒంటరిగానే తిరుగుతుంది. నీటిఒడ్డున గల చెట్లపైన, నీటిమధ్యగల రాళ్లమీద కూర్చుని చేపలకోసం పొంచిచూస్తూ వుంటుంది.

నీటిలో కదలిక కలిగినప్పుడల్లా మెడ రిక్కించి చూస్తుంది. నీటిలో ఎంత లోతున చేప కదిలినా ఇట్టే కనిపెట్టేసి ముక్కు కిందికిపెట్టి సూటిగా బాణంవలె నీటిలో మునుగుతుంది. కొంతసేపటికి చేపను ముక్కున కరచుకుని మళ్ళీ బయటికి వస్తుంది. వెంటనే నీటికి దూరానవున్న ఏ చెట్టుమీదికో పోయి చేపను వచ్చుడివచ్చుడిగా పొడిచి భోంచేస్తుంది. ఒక్కొక్కసారి నీటిపై ఎత్తున రెక్కలు తపతపకొట్టుకుంటూ నిలబడి హఠాత్తుగా రివ్వున నీళ్ళలోకి దూకి చేపలను పట్టుకుంటుంది. మార్చి, జూన్ నెలల మధ్య గుడ్లు పెడుతుంది కాలవలు, చెరువుల గట్లపైన గూడుకట్టుకుంటుంది చేపల ఎముకలు, నత్తగుల్లలు, ఎండ్రకాయల గుల్లలు మొదలైన వాటితో గూడు ఏర్పరచుకుంటుంది. అందుచేత గూడు సమీపంలో నుంచో లేనంత దుర్భరవాసన వ్యాపిస్తుంది 5 నుండి 7 వరకూ గుడ్లుపెడుతుంది.

## నెమలి

మగనెమలి పింఛం మూడు నాలుగు అడుగుల పొడుగుంటుంది ఆడ నెమలికి పింఛం వుండదు. తలమీద కుచ్చుమాత్రం వుంటుంది అరణ్యాలలోను, కొండల మీదనూ ఎక్కువగా నివసిస్తుంది గ్రామ ప్రాంతాల్లో కూడా చెదురుగా కనిపిస్తుంది. నదులు, సెలయేళ్లు పారే అరణ్యాలంటే దీని కెక్కువ యిష్టం. సాధారణంగా ఒక మగనెమలి, నాలుగైదు ఆడ నెమళ్లు కలిసి తిరుగుతాయి. కోళ్లమాదిరిగా నేల

## నెమలి



# ★ పాప ★

"సీతాపతి"



అందాల పాపాయి ఆడు కొంటోంది
పందిరిలో పాపమ్మ పాటపాడింది
  బంగారు పాపాయి బొమ్మలల్లింది
  బొమ్మలతో ఆడింది బొమ్మల్లపెళ్లి

బంతిపూలను తెచ్చి పోగుపెట్టింది
రేకలన్నీ చింపి పోగుపోసింది
  గుజ్జన్న గూళ్ళన్ని కుడువపెట్టింది
  వాళ్ళన్న వచ్చాడు వెక్కిరించింది.

అందరిని పిలుచుకుని ఆటకెళ్ళింది
అమ్మకేకేసింది వినిపించలేదు.
  అందాల పాపమ్మ అలసిపోయింది
  కడుపులో కావన్న గంతులేశాడు

అమ్మజ్ఞాపకమొచ్చి అట్టె పరిగెత్తి
అన్నమే అంటూను చిన్నగా ఏడ్చింది.

---

గీరుతూ తిండి సంపాదించు కుంటాయి మధ్యాహ్నాలు, సాయంత్రాలు నెమళ్ల గుంపులు బహు ఒయ్యారమైన మంద మంద గమనాలతో నీటి ఒడ్డుకిపోయి నీళ్లు తాగుతాయి. ఇవి బలే పిరికిపక్షులు. దృష్టి, శ్రవణం రెండూ చురుకుగా వుంటాయి. కాస్త అలికిడైనా జాగ్రత్త పడతాయి. ఎక్కువ ఎత్తు ఎగరలేవు. కాని హఠాత్తుగా అపాయం ఎదురైతే అతి కష్టంమీద నేల మీదనుండి లేచి ఎగుర్తాయి. మొదట నెమ్మదిగా ఎగిరినా, క్రమంగా వేగం హెచ్చించి దాటిపోతాయి. రాత్రిళ్లు ఎత్తైన చెట్లమీద గడుపుతాయి. తెల్లవారుకట్ల ఎక్కువగా అరుస్తాయి. ఆ అరుపు వాటి అందానికి తగినట్లు ఉండదు. వాటి అరుపును క్రేంకారమంటారు. ఎక్కువగా గింజలు, చెట్లవేళ్లు తింటాయి. కాని అడపా తడపా పురుగులు, బల్లులు, తొండలు, చిన్న చిన్న పాముల్నికూడా గుటకాయ స్వాహా చేస్తాయి. జనవరి, అక్టోబరు నెలలమధ్య ఎప్పుడైనా గుడ్లు పెట్టవచ్చు. గూడు పొదలమధ్య కట్టుకుంటాయి మూడు, నాలుగు, లేక అయిదువరకూ గుడ్లు పెడతాయి. గుడ్లు పిల్లలవడానికి 28 రోజులదాకా పడుతుంది. మగనెమలి చాలా ఆడనెమళ్లను పెళ్లి చేసుకుంటుంది ఋతుకాలంలో పింఛం విప్పి నాట్యం చేస్తుంది.

# అంతర్జాతీయ చలనచిత్ర ప్రదర్శనోత్సవం

ఐక్యరాజ్య సమితి వారి సలహా ననుసరించి భారత ప్రభుత్వపు సమాచారశాఖ ఫిల్మ్స్ డివిజన్ వారు భారతదేశంలో ఏర్పాటు చేస్తున్న అంతర్జాతీయ చలనచిత్ర ప్రదర్శనోత్సవంలో మొత్తం 23 దేశాలు పాల్గొంటున్నాయి అవి అమెరికా భారతదేశం రష్యా చీనా, ఇంగ్లండ్, ఇండోనీషియా నెదర్లండ్స్ నార్వే, రుమేనియా ఫ్రాన్స్, ఆస్ట్రియా పశ్చిమ జర్మనీ, జెకోస్లోవాకియా హంగెరీ అర్జెంటీనా, తూర్పు ఆఫ్రికా, స్విట్జర్లెండ్, కెనడా, ఇటలీ, ఈజిప్ట్ యుగోస్లావియా, జపాను పాకిస్తాన్ లు మొత్తం 40 మామూలు చిత్రాలూ 80 డాక్యుమెంటరీలూ ప్రదర్శించబడతాయి

ఈ చలన చిత్రాల ప్రదర్శనం బొంబాయిలో జనవరి 24 మొదలు ఫిబ్రవరి 6 వ తేదీ వరకూ జరుగుతుంది మద్రాసులో ఫిబ్రవరి 7 నుంచి 18 వ తేదీ వరకూ జరుగుతుంది తరవాత న్యూఢిల్లీలో ఫిబ్రవరి 14 మొదలు 20 వ తేదీ వరకూ, కలకత్తాలో ఫిబ్రవరి 21 మొదలు 27 వ తేదీ వరకూ ప్రదర్శనం జరుగుతుంది



ఆర్ పద్మనాభన్ వారి 'రాజేశ్వరి' లో శ్రీరంజని మాధురిదేవి, లంక సత్యం రేలంగి

## పాతాళభైరవికి స్థానం

ఈ ప్రదర్శనాలలో భారతదేశంలో తయారైన చిత్రాలలో ఉత్తమమైనవి నాలుగింటిని ఫిల్మ్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా వారు ఎంచారు అవి 1 పాతాళభైరవి (తెలుగు), 2 అమర్ భూపాలీ (మరాఠీ) 3 బాబ్లా (బెంగాలీ), 4 ఆవారా (హిందీ)

హాలీవుడ్ చిత్రాలలో 'ది వర్' అనే చిత్రం ప్రదర్శించబడుతుంది ఈ చిత్రానికి భారతదేశంలో కొంత షూటింగ్ జరిగింది మొత్తం నలభై చిత్రాలలోనూ ఇవిగాక ఇతర చిత్రాలలో ముఖ్యమైనవి 'పాల్ ఆఫ్ బెర్లిన్' (రష్యా), 'మెస్సాలినా' (ఇటలీ) 'స్టీల్ ఫైటర్' (చీనా), 'ది వైట్ హెయిర్ డ్ గర్ల్' (చీనా) 'విక్టోరియస్ వింగ్స్' (జెకోస్లోవాకియా), 'నైల్ బోయ్' (ఈజిప్ట్)

భారతదేశచరిత్రలో అపూర్వమైన ఈ ప్రదర్శనానికి వివిధదేశాలనుంచి అనేకమంది ప్రముఖులు ప్రతినిధులుగా వస్తున్నారు వీరందరికీ జనవరి 24 వ తేదీని బొంబాయి మహాలక్ష్మి ఇండియాటర్ఫ్ క్లబ్ మైదానంలో సన్మానమివ్వడానికి ఏర్పాటు జరుగుతోంది రష్యానుంచి సినిమాటోగ్రఫీ శాఖ డిప్యూటీ మంత్రి యం యస్ సెమ్యొనోవ్ నాయకత్వం కింద మొత్తం పదముగురు ప్రతినిధులు వస్తున్నారు అమెరికానుంచి 'ది రివర్' నిర్మాత కెన్నెత్ మెకెల్డోనీ కాక కొందరు తారలు కూడా వస్తారు చీనానుంచి చాలమంది ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు, టెక్నీషియన్లు, తారలు రాగలరని తెలుస్తోంది ఇంగ్లండ్ నించి సర్ రాల్ఫ్ రిచర్డ్ సన్ కెరోల్ రీడ్ మొదలైనవారు, ఫ్రాన్స్ నించి ఆంద్రీ షాత్యే, జీక్ దాపీ మొదలైనవారు వస్తారు

మద్రాసులో ప్రదర్శనానికి శ్రీ ఏ రామయ్య, శ్రీ యస్ యస్ వాసన్ శ్రీ హెచ్ యం రెడ్డి శ్రీ కె శ్రీనివాసన్ (రీజనల్ సెన్సార్ బోర్డ్), మేరీకట్ వాలా, శ్రీ కె రామ్ నాథ్ శ్రీ యల్ యల్ పటేల్ గార్లు నిర్వాహకులు ★

# సంక్రాంతి సినిమా ఉత్సవం



మొన్నటి సంక్రాంతి నాడు మద్రాసు వాహినీ స్టూడియో హాల్‌లో సంక్రాంతి సినిమా ఉత్సవం జరిగింది ఈనగరంలో సినిమా రంగానికి చెందిన పలువురు ప్రముఖులు ఉత్సవంలో పాల్గొన్నారు ఆహూతులైన రెండుమూడు వేల మంది పురజనులతో, రకరకాల రంగు రంగుల దుస్తులు ధరించిన సినీ జనంతో స్టుడియో ఆవరణం కలకల లాడింది విజయావారు నేత్ర పర్వమైన అలంకారాలు చేశారు.

ఉత్సవంలో ముఖ్యమైనదీ, చెప్పుకో దగినదీ అయిన అంశం ఏమిటంటే నటీ నటులు, డైరక్టర్లు, ప్రొడ్యూసర్లు గాయకులు, ఒకరేమిటి సినిమా రంగానికి చెందిన యావన్మందీ వినోద వేషాలు(ఫాన్సీడ్రెస్) ధరించి స్టుడియో వీధుల్లో విచ్చల విడిగా, విశృంఖలంగా విహరించటం చలన చిత్ర ఆకాశంలోని తారాబలం అంతా కండ్ల ఎదుట సాక్షాత్కరించిందంటే అతిశయోక్తి కాదు

అందాలతార అంజలీదేవి జిప్సీ నాట్యగత్తె వేషంవేసి నాట్యంచేసింది భానుమతి దొరసాని వేషంవేసి కర్లీలు, చాకలెట్లు అమ్మింది అంజలి, భానుమతి చేయీ చేయీ కలిపి నాట్యంకూడా చేశారు కాంతకుమారి జిప్సీ దాని వేషం వేసిమువ్వల డప్పు మోగించింది. రంగారావు రంగుల బొంగరాలు అమ్ముతూ తిరిగాడు నాగేశ్వరరావు కోటప్ప కొండ యాత్రికుడి వేషం వేసి కొందరు భక్తులను వెంట పెట్టుకుని "గోవిందా గో—విందా" అంటూ అడుగడుక్కూ మూర్ఛపోవటం మొదలెట్టాడు డైరెక్టర్ ప్రసాద్ జూదగాడి వేషంలో జోగారావును, ముగ వేషంలో సావిత్రిని వెంట వేసుకుని "కాయ్‌రాజా కాయ్‌రాజా" అంటూ ("మోసంలేదు, అంతాదగా") తిరిగాడు రేలంగి పాకీవాడి వేషం వేసి, చీపురుకట్ట పట్టుకుని "బీదాణ్ణి బాబూ" అని ప్రేక్షకులను నవ్వించాడు లింగమూర్తి కళగోపం పెట్టి బఫూన్ చేష్టలు చేశాడు ముక్కామల మార్వాడీ వేషం, విజయా అధిపతి నాగిరెడ్డి మాజీ సిపాయి వేషం చక్రపాణి నైజాం దేశ్‌ముఖ్ వేషం వేశారు డైరక్టరు రామకృష్ణ, వి పుల్లయ్య "ప్రొహిబిషన్ గిహిబిషన్ నై, ఆవో పీవో" అని సరబత్తు పంచిపెట్టారు గోవిందరాజుల సుబ్బారావు వంటినిండా పంగనామాలతో హరిదాసులాతయారయ్యాడు ఘంటసాల వెంకటేశ్వరరావు భజన బృందం వెంటేసుకుని తిరిగాడు తమిళ హాస్య నటులు రామచంద్రన్, సారంగపాణి కోయ దంపతుల వేషాలు వేశారు ఎన్ టి రామారావు ఎలుగుబంటి నాడించాడు పాపం రామారావు "నోడెమ్మ" వేషంతో వెంటబడిన గంగారత్నం నుండి తప్పించుకోడానికి చాలా శ్రమపడ్డాడు వంగర వెంకట సుబ్బయ్య చైనా వాడిలాగ తయారై బెలూన్ లమ్మాడు బాలకృష్ణ "ఆంగ్లో ఇండియన్ లేడీ" వేషం వేసి ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించాడు కథారచయిత కొడవటిగంటి కుటుంబరావు పోలీసు వేషం, విజయావారి ఆర్టు డైరక్టరు గోఖలే ఫ్రెంచి డాక్టరు వేషం వేశారు

జానకి, కన్నాంబ, జయమ్మ, పుష్పవల్లి వసుంధర ఉత్సవానికి వచ్చారుగాని వేషాలు వెయ్యలేదు జి వరలక్ష్మి, ఎస్ వరలక్ష్మి, కృష్ణవేణి మొదలగు కొందరు ఎక్కడా కనిపించ లేదు శ్రీ రంజని "గుణసుందరి కథ" లోమల్లె ఎలుగు బంటితో కొంతసేపు తిరిగింది



వీధి నాట్యగత్తెలు భానుమతి, అంజలి



'తూరుపు సాయి త్రిరి'—రేలంగి, వల్లరామ్మూర్తి, లక్ష్మిరాజ్యం.



చీనా బెలూన్‌వాలా, వంగర, 'చింగ్ చౌ'



జిప్సీలూ, మాయమీసాలూ భీమవరపు. పుల్లయ్య, శాంతకుమారి, ముక్కామల.



'నైజాం దేశ్‌ముఖ్' చక్రపాణి, 'మరాఠీ' పింగళి, 'బాంగరాల' రంగారావు, కె. వి. రెడ్డి మొదలైనవారు.



జోగి, జోగీ-రాసుకుంటే' - కోటప్ప ండయాత్రికుడు నాగేశ్వరరావు, హరిదాసు' గోవిందరాజుల సుబ్బారావు, ఇద్దరు జోగుల్ని చూసి నవ్వుతున్న శ్రీవత్సం.



'పండగ డబ్బులు బాకీ' అంటూ రేలంగి, పక్కనే ఘంటసాల 'డప్పు బృందం'.



బార్ మెయిడ్' భానుమతి, 'మాజీ సిపాయి' నాగిరెడ్డి

సాయంకాలం 6-30 కల్లా స్టుడియో యావత్తూ రంగు రంగుల విద్యుద్దీపాలతో దేదీప్యమానంగా ప్రకాశించింది ప్రేక్షకులంతా ఒక చివరగల వేదిక వద్దకు చేరారు అక్కడ "లారాలప్పా" మొదలైన హిందీ పాటలకు అనుగుణంగా అంజలి, భానుమతి, శాంతకుమారి సావిత్రి మొదలైన కొందరు హాస్య నృత్యం చేశారు తరవాత రేణుకా వారి తరఫున గిడుతూరి వెంపటి "మానవుడు చిరంజీవి అనే నాటకం ప్రదర్శించారు తరవాత నల్ల రామ్మూర్తి రచించిన "తూర్పు సావిత్రి అనే ఫార్సు ప్రదర్శించబడింది ఇందులో రేలంగి "సత్తెమంతుడు"గానూ, లక్ష్మీరాజ్యం "సావిత్రి" గానూ నల్ల రామ్మూర్తి "యమధరమ రాజు" గానూ టి.పి. చాణక్యరావు ప్రాంప్టర్ గానూ నటించారు చివరికి రేలంగి "నాకు తక్కువ కోర్క నిచ్చావు, నీ కెక్కు వుంచుకున్నావు" అని రామ్మూర్తితో దెబ్బలాడాడు తరవాత సరస్వతీగాన నిలయం బాలికలు చేసిన నృత్య ప్రదర్శనంతో ఉత్సవం ముగిసింది

వినోద వేషాల్లో ప్రతి ఒక్కటీ ఆకర్షణీయంగా వున్నది. ముఖ్యంగా ఆ జరీ భానుమతి, రేలంగి, ప్రసాద్ వేషాలు బాగున్నాయి. ఉత్సవంలో విజయా, వాహిని, రేణుక, అమర్ ఇండియా, యువా నారాయణన్ కంపెనీ, భరణీ, అంజలీ రాగిణీ, అసోసియేటెడ్ ప్రొడక్షన్సు, ప్రసాద్ ఆర్టు పిక్చర్సు, రాధాకృష్ణ ఫిలిమ్సు మొదలైన సినీ కంపెనీలవారు పాల్గొన్నారు. దక్షిణ భారత చలన చిత్ర చరిత్రలో మొట్టమొదటి సారిగా జరిగిన యీ సంక్రాంతి ఉత్సవం ఏర్పాటు చేసింది విజయావారే. పండుగ వేడుకల నన్నిటినీ మూడు వేల అడుగుల చిల్లరదాకా ఫిలిమ్ తీశారు

(ఇక్కడ ప్రచురించిన ఫోటోలు తీసినవారు స్టిల్సు సత్యం, రాజా, విజయా స్టాఫ్ ఫొటోగ్రాఫర్లు)







విదూషకుడు యన్ టి రామారావు




'కాయ్ రాజా కాయ్' పందెం కట్టడానికి కాసుకున్న ప్రసాద్, సావిత్రి జోగారావు

—తారల సంక్రాంతి ఉత్సవం

ప్రమాదవశాన కలిగిన పరిచయం ఇదరి మధ్యా ప్రేమగా పరిణమిస్తుంది. ఒకనాడు ఒక బాంక్ దోపిడీ చేసి పోలీసుల బారినుండి తప్పించుకోడానికి జగా వచ్చి లీల ఇంటిలో దూరి ఆమె కేకలు వెయ్యబోగా ఆమె గొంతుక నులమడానికి ప్రయత్నిస్తాడు. ఆ సమయంలో రాజ్ వచ్చి తల్లిని రక్షించుకోడానికి జగాతో తలపడి అతన్ని చంపుతాడు. హత్యనేరానికి పోలీసులు రాజ్‌ను ఎరెస్ట్ చేస్తారు. రాజ్ తరపున సాక్ష్యం చెప్పవచ్చిన లీల కారు క్రింద పడి చనిపోతుంది. ఆ ఆస్పత్రిలో చనిపోయే ముందు లీల తన సెవరైనది రాజ్ ... రీటాకు తెలుపుతుంది. తన తల్లిని విడిచిపెట్టి కష్టాలపాలు చేసిన తన తండ్రి రఘునాథ్ అని తెలుసుకుని రాజ్ జైదునుండి తప్పించుకుని రఘునాథ్‌ని చంపడానికి ప్రయత్నిస్తాడు. రఘునాథ్ అతన్ని పట్టుకుని పోలీసులకు అరెస్టు చేయిస్తాడు. ఆత్మరక్షణార్థం జగాను చంపాననీ రాజ్ వల్ల దోషం లేదనీ రఘునాథ్‌కి రీటా ఒప్పచినా జైదునుంచి తప్పించుకున్నందుకూ తనపై హత్యా ప్రయత్నం చేసినందుకూ రఘునాథ్ రాజ్‌ను కోర్టులో విచారణకు తీసుకువస్తాడు. రీటా రాజ్ తరపున వాదించి అతను దొంగ కావడానికి తండ్రి నిర్దయగా విడిచిపెట్టెయ్యడమూ, అతని పరిసరాలూ హేతువులని చెప్తుంది. రాజ్‌కి మూడేళ్ళ జైదు మాత్రం విధించబడుతుంది. రఘునాథ్ తన తప్పిదం తెలుసుకుని కుమారుని ఆదరిస్తాడు. జైదునించి తిరిగివచ్చేవరకూ రాజ్ కోసం నిరీక్షించి అతన్నే వివాహం చేసుకుంటానని రీటా మాట ఇస్తుంది.

పరిసరాల ప్రభావంవల్లనూ కొందరి నిర్లక్ష్య ప్రవర్తనవల్లనూ మనుష్యులు దొంగలౌతున్నారని నిరూపించడానికి పరిసరాలను చిత్రించడంలోనూ ఇతర ఘట్టాలలోనూ కూడా ఛాయాగ్రహణం కథకు ప్రాణం పోసింది. ఉజ్వల ప్రేమను చిత్రించడానికి బర్సాత్‌లో వెలుగునీడల కంటె దృశ్యాలూ పర్వతాలూ నదులూ తోడ్పడ్డాయి. ఆవారాలో నీడల ప్రభావం మనుష్యుల మనస్తత్వం నిరూపించడానికి ఆయా సన్నివేశాలను చిత్రించడానికి చక్కగా వినియోగించబడింది. జగాతో ఒలపడేసప్పుడు బలహీనుడైన రాజ్ బలవంతుని చిత్తు చేసినట్లు (కొన్ని చిత్రాలలో మాదిరి) చూపించకపోవడంలో రాజ్‌కపూర్ వివేచన కనపడుతుంది. చావు దెబ్బలు తింటూ తప్పించుకోలేక చివరికి ఏకరువపాటున కత్తి తీసుకుని జగాను పొడిచేస్తాడు. ప్రేమప్రదర్శన కోసం హిందీ చిత్రాలలో పాశ్చాత్య ... ఫక్కీల అనుకరణ మరింత అధికమౌతోంది. అదే ఆవారాలో కూడా కనపడుతుంది. బీచ్ దృశ్యాలూ స్వప్నాలలో బొటుసి కారులూ విశృంఖలంగా చిత్రించబడినాయి. మాడమ్ ఒక్కి ఆధ్వర్యం కింద నిర్వహించబడిన

# ముఖ్య గమనిక

మా వద్ద *F/Cap Chandler & Price Treadle* ఒకటి మంచి కండిషన్‌లో విక్రయమునకున్నది. వలయువారు రు 3000/ లకు పైబడి ఆఫర్ పంపినయెడల యెవరి ఆఫర్ హెచ్చుగ వచ్చునో వారికి ఖాయపర్చబడును.

సంప్రదించవలెను

శ్రీరామా ప్రింటింగు వర్క్సు

54 నారాయణ ముదలి వీధి

మదరాసు 1



నేను మడిగట్టుకున్నాను రా—గంగారత్నం
తారల సంక్రాంతి ఉత్సవం

స్వప్న దృశ్యం చిత్రణ అద్భుతంగా ఉంది అయితే స్వప్నాలు అంత స్పష్టంగా ఉంటాయంటే నమ్మడం కష్టం దొంగతనం చెయ్యమని నిత్యం ప్రోత్సహించే జగ్గా ప్రభావానికీ, రౌడీ బ్రతుక్కి స్వస్తి చెప్పి రీటాను వివాహమాడి సచ్ఛీలంతో కొత్త జీవితం ప్రారంభించాలనే మనో వాంఛకీ మధ్య పెనగులాడుతున్న రాజ్ కి ఒకనాటి రాత్రి కల వస్తుంది స్వప్నాకాశంలో తన ప్రియురాలు స్వప్న దేవత వలె సాక్షాత్కరించి ఆహ్వానిస్తుంది రాజ్ ఆమె వద్దకు చేరుకోడానికి చేసే ప్రయత్నంలో మధ్య మధ్య భీభత్సాకారాలు నిరోధిస్తాయి చివరికి అన్నిటినీ అధిగమించి నక్షత్రాలలో నక్షత్రమై ప్రకాశించే ప్రియురాలిని చేరుకుంటాడు ఈ దృశ్యంలో నర్గిస్ కి అలంకరణ చేసిన వారి ద్దరు పాశ్చాత్య వనితలు ప్రేక్షకుల నీ అలంకరణ ఈ దృశ్యాలూ బాగా ఆకర్షించగలవు మొత్తానికి రాజ్ కపూర్ హిందీ చలనచిత్రరంగంలో విశిష్టస్థానం ఏర్పరచుకున్నాడని చెప్పాలి

ఎసోసియేటెడ్ ప్రొడక్షన్స్‌వారి

# అమ్మ

నటీనటులు

శాంతకుమారి, లలిత, టి యస్ సరోజ, తిక్కురిసి, నంబియార్ మొదలైనవారు

దర్శకుడు వేంబు

ఉత్కృష్టమైన మాతృప్రేమను, నేటి యువతీయువకుల అజ్ఞానాన్ని నిరూపించే ఈ తమిళచిత్రంలో తల్లిగా శ్రీమతి శాంతకుమారి చక్కగా నటించింది కథ పాతదే అయినప్పటికీ వాస్తవస్థితిగతులను ప్రతిబింబింప చేయడానికి కథారచయిత, దర్శకుడు కృషిచేశారు

కోడలి ఆగడంవల్ల ఇంటినుంచి వెళ్ళిపోయిన తల్లి, భార్య ఖర్చుదారీతనంవల్ల జైల్లోపడ్డ కొడుకు, అతన్ని విడిపించడానికి దొంగతనంచేసిన తల్లికిసంబంధించినది కథ మధ్య మధ్య హాస్య సంభాషణవల్ల అసలు కథలోని ఉదాత్తఘట్టాలకు భంగం కలగక పోవడం ఈ తమిళచిత్రంలో విశేషం

# సినిమా వార్తలు

## హిందీలో పాతాళభైరవి

తెలుగులోనూ అరవంలోనూ విరివిగా డబ్బుచేసుకున్న విజయా ప్రొడక్షన్స్‌వారి పాతాళభైరవి చిత్రాన్ని విజయావారి తరఫున జెమినీ ఎక్స్‌చేంజ్ సర్క్యూట్ వారు హిందీలో తీస్తున్నారు సాధనావారి 'సంసారం' జెమినీవారు అసలు కథకులు దర్శకులు నిర్మాతల పేరైనా లేకుండా హిందీలోనూ అరవంలోనూ తీసుకున్నట్లుగా పాతాళభైరవి సందర్భంలో జరగదు జెమినీవారు అవసరమైన చోట్ల తిరిగి షూట్ చేసినా పేరు విజయావారిదే ఉంటుంది హిందీ 'పాతాళభైరవి కి పాటలు మాటలు వ్రాస్తున్నవారు పండిట్ ఇంద్ర

## తెలుగు చిత్రాలు

ఈ నెల అనగా జనవరి 1952 లో ఇంతవరకూ ఒక్కటే తెలుగు చిత్రం విడుదలయింది అది శోభనాచలవారి 'సావాసం' 14 వ తేదీని విడుదల కావలసిన సర్వోదయావారి మానవతి విడుదల కాలేదు నెలాఖరులోగా భారత లక్ష్మీవారి ప్రయోగాలు విడుదల కావచ్చు భరణీవారి ప్రేమ ఫిబ్రవరి మూడో వారంలోనూ రాగిణీవారి 'ధర్మదేవత, విజయావారి 'పెళ్ళిచేసిచూడు మార్చిలోనూ విడుదల కావచ్చు వినోదావారి 'శాంతి' జనవరిలోనే విడుదల కావచ్చు

**సవరణ**
మా సినిమా సంచిక 68 వ పేజీలో మూడో చిత్రంలోని వ్యక్తి పేరు 'మాస్టర్ కుందు' కి బదులు 'మధు' అని చదువుకోవలెనని ప్రార్థన
—సంపాదకుడు

# సాక్షులు

(7-వ పేజీ తరువాయి)

"చెప్పకేం జేస్తాను వినండి బాబూ! చూట్టానికి వొట్టి అమాయకుడల్లేవుంటాడు, నోట్లో వేలెడితే కొరకడం కూడా తెలియనట్టుగా ఉన్నట్టేవుండి యెంతెంత గోతులు తీస్తాడో మీకేం తెలుసు? మొదిత్తే ప్రతి మాటా మావయ్యతో చెవుతానని లగత్తాడు ఆయ నీ వూళ్లో అడుగెట్టాడు, మా వోటోళ్లకి శనట్టుకుంది"

"అస లే వూరంటావ్?"

"ఆఁ పేరేవిటో తెలిస్తే గందా వూరు మాట ఎప్పుడో నా సిన్నప్పుడు తిరపతయ్యగారి సెల్లె లొకావిడ ఉండేదంట ఏ వూరో యిచ్చి పెళ్లి జేశారంట వాళ్లు వెళ్లి అక్కడే ఉండి పోయారంట

కొన్నాళ్ళకి లేక లేక యీ బంగారు నాయన పుట్టుకొచ్చాడంట తల్లి సచ్చిపోయింది తండ్రి దగ్గిరే పెరుగుతున్నాడు —ఇంతలోనే మా సిట్టెయ్యగారి కొడుకు సెవరో యెత్తుకుపోవడం, ఆయనకోసం కొన్నాళ్లు దేశాలంబడి తిరగడం, చివరికి దొరక్క పోవడం—పుట్టిన వొక్క కొడుకూ యీవజాన అయిపోవడంవల్ల ఆయన దిగులెట్టుకుని, దిగులెట్టుకుని సీకున పడిపోవడం—కొన్నేళ్లు ఇట్టా గడిచాయ్"

"సరేగానీ—కొడుకు సెత్తుకు పోవడ మేవిటి?"

"ఏవుందిబాబూ! ఏది జరిగినా గొప్పోరిళ్ళల్లోనే జరగాలి బిడ్డ బూమ్మీద పడగానే బంగారం తొడిగేస్తారు గందా! యిదంతా యెందుకొచ్చింది?—మా వోటోళ్లమంతా యేం బెట్టి పెంచుతున్నాం—అట్టాగే పెంచుకొచ్చారా మారాజులు

మూడేళ్లు పెరిగాడు, తల్లి ఏ గొడ్డపొదిట్లో కబుర్లాడుతూ కూకుందో నడీదిలోకి నడిసి పోయాడంట బిడ్డ ఎవురు జాలాలో దొ వురికోళ్లు కుట్టినయ్యో అమాంతం యెత్తుకు పోయారు? ఎక్కడికి తీసుకుపోయారో ఏంజేశారో అయిపూ-ఆనాం లేదుగందా!

"ఎంత గొప్పోరతే మటుకేం?-అది లగాయితూ మళ్ళీ సంతానం లేదు మారాజుకి ఎంతమందో పోరగా, పోరగా యీ బాబుని తీసుకొచ్చి పెంచడం మొదలెట్టాడు తమ్ముడికూతుర్ని కూడా దగ్గిరకి తీశాడు

"పెళ్లి—పేరంటం అన్నీ వైబవంగానే జరిగినయ్ యీ తిప్పకాయకి పనా? పాటా? వొండని కూడూ, వొడకని బట్టాను కూ తీరుగానే రోజాలు గడుస్తున్నయ్. ముజ్జి, ముజ్జి మావోటోళ్లని వేదిరిత్తా వుంటాడు కాస్తా? కూస్తా? అరవై డెబ్బై యెకరాల అస్తి అదుగో అకనబడే పెద్ద మేడ ఆయనదే లచ్చలు డబ్బు మూల బడి మూలుగుతోందంటారు అంతాను మావోటోళ్లం తిండిగింజలు దొరక్క చస్తుంటే ఆమారాజు కొనడానికి పొలం దొరక్క ఏం జెయ్యాల అని సీకున పడిపోతున్నాడంట. యామైతే ఏం లాబం, అన్యాయం చేతులో కొస్తే మావోళ్ల పట్టపగలు పట్టదనుకోండి"

"అయితే తిరపతయ్యగారి ఆస్తికంతకి ఇతడే వారసుడన్న మాట?"

"కాక మరెవరొస్తారు బాబూ! మా కురికి రాయనీయండి, పుట్టబోయే మనవడికి రాయనీయండి ఎన్ని విధాలుగా మార్చుకున్నా అదంతా వాళ్లక్కాక మరెవరికొస్తుంది? మాస్తా మాస్తూ, నే కులారా, సిల్లిగవ్వయినా వొకళ్ల చేతులో పెట్టడు గందా! ఆయన అట్టున్నా మా బాగే"

"ఉండక ఇప్పుడే మైదంటావ్?"

"ఏమైందేంటి బాబూ ఇప్పుడు సరాసరి నెత్తిమీదికే వొచ్చింది యీయన పంచాయితీకి పెసిడెంటయి నప్పటించీ మా ప్రాణాలు కొరికేస్తున్నాడంటే నమ్మండి! మాకిచ్చేది కూలికి, ముష్టి ముప్పై రూపాయిలు. దానికోసం వొంద రూపాయిల పనిజేయించుకుంటాడు అదేపాయెవుళ్ళో వొకళ్లింటికాడ పడుండాలి. ఈళ్లిచ్చే నాలుగు రాళ్లెవరికి చాల్తాయ్? కష్టం చేసుకుంటే యీమాత్రం సంపాయించుకోలేమా? అందుకనే యీ వూర్నించి మకాం మార్చాలనుకుంటున్నాం

"ఏ కష్టేయించాలన్నా దమ్మిడీకాణ్ణించి లెక్క జూసుకుని" అమ్మయ్యో!, అని బెన్ను జరుచుకుంటాడు దానికి తగ్గట్టుగానే ఆయనగారి అజమాయిషీకింద అన్నీ అట్టాగే అఘోరిస్తుండయి లెండి! యీమే ఒకటి జూడరాదూ? అందరూ కీసులాడుకుని బంగారమంటి దాన్ని ఏతజావ తగలేశారో

"మేం యీ వూర్నించి లేచిపోయేటప్పుడు యీ మేడకి మూడుసార్లు ప్రద

కుణంజేసి దణ్ణంపెట్టి మరీ కదిలాడు మా ముసిలోడు

"ఆమడిసి కేదో పెద్దనమ్మకం దీల్లో దేవుల్లో దయ్యాల్లో వుంటయ్యని కాదు బాబూ మరి

"ఆ రోజుల్లో అట్టాగే వుండేది మాకందరికీను ఈ సెట్టు జూసినోళ్లు రెవుళ్లు కదిలిపోతారు జెప్పండ ఊరు వూరంతా యిక్కడికొచ్చి కూకుని సదువుకుంటుంటే అదీ సూడ ముచ్చటగానే వుండేది ఎంతెంత మారాజులో వొచ్చి సబలు జేసే వోళ్లు జమీందారుగారొస్తే యిక్కడే మకాం బెట్టే వోళ్లంట ఇప్పుడేముంది జెప్పండి, సవుడుగారి పిడకల గుడిసెకు మల్లే తయారవుతా వుంది"

"అయితే అప్పుడిది పెద్ద స్కూలన్న మాట?"

"ఎబ్బె-యిసుకోలు కాదు బాబూ! దాని పేరేటో అంటారు, మా అబ్బాయికి తెల్చు

"ఒకటా రెండా? ఎన్ని పుస్తకాలుండయ్యో అంతూ పొంతూ లేదు గందా పోయినయిపోగా ఉన్నవన్ని యీ మేడ మీద బడి పురుగునాకి పోతుండయ్ ఆలనా? పాలనా? సూసే దిక్కెవరు బాబూ? సదువుకునే రోజుల్లో యెవుళ్లసేతి కందినవి వాళ్లు దాసేసేవోళ్లంట ఎవరన్నా నీ బోటి మారాజు 'అదేమ'ని అడిగితే ఆరికి రెవుకలిరిగేయంట—

"ఇక్కడెవరో పన్నెసి మారాజుంటే పోయిన వాటన్నింటికీ సెబ్బ కట్టకు నే వాడంట పెసిడెంటు సివరకి ఆరి కోయకరం వుంటే పఢీదిలో పెట్టి యేలం వేయించారంట ఇంకా యిక్కడికొచ్చి బాగుపడి బట్ట గట్టె దెవరు బాబూ?

"అప్పట్టించీ పెసిడెంటు గిరీ సేతులు మారుతోందిగానీ, యీ మేడకి మాత్రం వొడ్డగింజ వాసయినా కళా కాంతులు పట్టలేదు బాబూ! ఎవరి మటుక్కు వారు బొక్కసాలు నింపుకోవాలని జూసే వారే గాని

"ఇదంతా నీకెట్టా తెల్చునంటారు కాదూ, సిన్నప్పట్టించీ యిక్కడ పెరిగిన మోహంవల్ల యీడాదికి రొండు మూడు సెల్లవొచ్చి వుండకబోతే మా ముసిలోడికి మతి ఆగేది కాదు వొచ్చినప్పుడల్లా జరిగిందంతా తెల్చుకొంటూ వుండే వోళ్లం

"పైగా మా అబ్బాయ్ బొమ్మరిది వొకడిక్కడే వుండి పద్దేస్తూ వుంటాడు ఆడు సిన్నపుడు చదువుకున్నాడు లేండి యీ సిత్రయిసిత్రాలన్నీ ఆడు యేకరువు బెడుతుంటే యేం యిన సొంపుగా వుంటుందని జెప్పను? అయినా స్మికరి రోజుల్లో యిక్కడే బతుకుదామని వొస్తే యీవజాన తయారయిందె బాబూ!"

"అయితే యిది పెద్ద లైబ్రరీ అన్న మాట" అని అతను తనలో తనే మెల్లిగా గొణుక్కున్నాడు. ఆమె విని "ఏటి బాబూ ఏటి అంటున్నారు—దీని పేరు అదగదే మావోడు అంటుంటే యిన్నాను లేండి— అంతే నాకు తెలియకగురుతొన, యెవుళ్లు బడితే వాళ్లు యిష్టం వొచ్చినట్టు వొస్తూ పోతూ వుండొచ్చని అర్థమా బాబూ?"

"అవును—అంతే"

"అందుకనే యిదంతా కప్పల తక్కెడగా తయారయిపోయింది సూడండి ఆ అరుగులమీద కూసుని సెవుకోసిన నక్కలల్లే యెట్టా వాక్కుంటున్నారో యీళ్ల వల్ల కొంతయినా అవుద్దంటారా? "ఏమీ కాదు"

సానా సేషయింది మా ముసిలోడింటి కొచ్చే యేళ్లయింది అటు వూళ్లోకెళ్లి గనుక్కుంటే అన్ని తెలుస్తయ్ బాబూ! ఆలోసించి మటుకు దుకాణం పెట్టండి!"

"నాకు తెలియవలసినదంతా నువ్వే చెప్పేశావ్ ఇంకా రెవర్నడగను? అందరూ నీకు మల్లే రెండుకు చెవుతారు? నా దుకాణం యీ వూళ్లో పెట్టినే మీకు మల్లేనే నేనూ యింకొక చోటు చూసుకుంటాను నాకొక వూరవీట ఎక్కడ బాగుంటే అక్కడే'—

వరికంకులు ... ల గరుచుకుని చిలుకలన్ని ... చేరుకుంటుంటే వారి ... ప్రయాణం సాగారు

★







ఫల వృక్షాలతోట ఇందులో చిత్రించబడింది దీన్ని రచించిన కెరోలిన్ డ్యూర్ ఈమాదిరి కళను పునరుద్ధరించిందట

RegdNo. M 4479

ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడు

**అలెగ్జాండర్ డ్యూమా**

రచించిన

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

రెండవ భాగం

అనువాదం

మారంపూడి సీతారామ్

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికనుండి పునర్ముద్రితము

**వెల: మూడున్నర రూపాయలు**

**అమ్మకమునకు సిద్ధముగానున్నది**

[illegible]

ఆంధ్ర గ్రంథమాల,

మద్రాసు 1.

Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras